# అడవిపువ్వులు

కృతికర్త:
ఉభయభాషాప్రవీణ
మిన్నికంటి గురునాథశర్మ
ఆంధ్రోపాధ్యాయుఁడు
టవున్ హైస్కూలు, గుంటూరు

ప్రకాశకులు:
కా. నాగేశ్వరరావు

౧౯౩౩] [౧ ౦ ౦

మహామహోపాధ్యాయ 'కవిసార్వభౌమ'
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు.

రాజమహేంద్రవరము, 23 4-34.

సీ॥ "గురునాథు నడవిపూల్ క్రొంగ్రొత్తవలపులు
పొలముల వెదఁజల్లి పొదలుననుచుఁ
దెలుఁగుఁబల్కుఁబోలంతి తెలిసి నాగేశ్వరు
వేఁడి వడయఁగల్గి వేఁడుక మెయిఁ
దనదు కన్నులఁ గప్పుకొని శిరంబునఁదాల్చె
పరమసౌగభ్య సంవాసితమ్ము
లవి జగదానంద మమరంగనై కవి
మధుపాళి సేవ్యమై మాటకారి
తే॥ యగుచుఁ గాకాదికుకవుల నవులఁద్రోలి
దైవపుంజెద్దియి నాధిపత్యము వహించి
జాళువాపైడి నానెందు మేలుగాంచి
మించునెంతయుఁ గైకొని మేలిపలుకు"

కింకవీంద్ర ఘటాపంచాననేత్యాది బిరుదాంకితులగు,
బ్ర॥ చళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి శతావధానిగారు

కడియము, 28—1—34.

"మీ అడవిపువ్వులు అడవిపువ్వులవలెఁగాక ఉద్యానవన పుష్పములవలెనే యున్నవనుటకు సందియములేదు. చక్కఁగాఁ రచించు సుకవులగు మీరచనపై నింతకన్న నా యొసఁగఁదగు నభిప్రాయముండదుగదా యని సూత్రప్రాయముగా నిప్పటి నా శక్తినిబట్టి లిఖించి విరమించుచున్నాఁడను...... ఇప్పుడిప్పుడు నా వ్యాధి వెనుకంజవేయుచున్నది.

ఆశుకవి చక్రవర్తి కుండిన కవిహంసేత్యాది బిరుద విరాజితులగు బ్ర॥ కొప్పరపు సోదరకవులు, శతావధానులు.

......ఇందలి పద్యకుసుమములు, ఆరణ్యకుసుమములవలె నిసర్గరమణీయములై సన్నికృష్టజనాకర్షణశక్తిమంతములై యొకని [illegible]

గాక సహృదయ చిత్తాహ్లాదదాయకములైనందున నీ గ్రంథమున కీ నామ మన్వర్థనామమై యుండెను.

కవిత్వము నిర్దుష్టమై ధారాసమృద్ధి నింపొందినది.

ఇది F. A. B. A. తరగతుల విద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగ నుంచిన యెడల దత్తత్కళాశాధిపులకు విద్యాశాఖవారికెక్కువ యుపకారమొనర్చిన కీర్తి నందకపోదని మా హెచ్చరిక.

మ॥ కన మీరీతిని భిన్నభిన్న విషయాక్రాంతిం జవుల్గుల్కు ప
ద్యనికాయంబును గన్న గ్రంథముల నాంధ్రంబందు, గైర్వాణి నుం
డెను శ్రీపండితరాయ ముఖ్యులకృతుల్ నీగ్రంథమాంధ్రావనిన్
గొనుగాతన్ సరసాళిసన్నుతులు నీకుం బేరుదక్కించుచున్॥

ఆంధ్రవిశ్వకళాశాలాపండితులు
బ్ర॥ వఝ్ఝుల చినసీతారామస్వామిశాస్త్రిగారు.

విజయనగరము, 14-11-1928.

“....అడవిపువ్వులు” అను మీగ్రంథమును స్థాలీపులాకన్యాయముగఁ జదివితిని. ఈగ్రంథమునందలి యభిప్రాయములు హృదయంగమములై యున్నవి. వివిధవస్తు వర్ణనాపరములగు నిట్టి కావ్యము లాంధ్రవాఙ్మయమున ననేకములు లేవు. ఇయ్యది యధునాతనాంధ్రభాషాసేవకుల యాదరణమునకుఁ బాత్రమై వెలయఁగలదని నా నమ్మకము.

ఉభయభాషా కవిత్వోపాయశాలి,
బ్రహ్మశ్రీ శిష్ట్లా హనుమచ్ఛాస్త్రిగారు

గుంటూరు, 10—7—34.

కం॥ “మీ యడవిపువ్వులం గని
నా యుల్లమనంతమైన నర్మిలిఁ గాంచెన్
దయని త్తిన్నని కవన
శ్రీ యింపుఁ గలంగఁ గనసమృద్ధిక నెలదై”

# కొన్ని పత్రికారాజముల యభిప్రాయములు.

**గృహలక్ష్మి,** 1933 సెప్టెంబరు.

బాస, కవి, వానకోయిల............మొదలగు 30 విషయములమీఁద పెక్కు అన్యాపదేశపద్యములు వ్రాయఁబడినవి. కల్పనలు, నీతులు అమూల్యములు. శైలి లలితము, సరళము. సంస్కృతములో తప్ప తెలుఁగు భాషలో ఒక్కకవి వ్రాసిన ఇన్ని అన్యాపదేశపద్యము లింత సరసమైనవి లేవనియే చెప్పవలెను. విద్యార్థులకు విశుద్ధసుందరభాషను, విచిత్రమనోహరభావములను, ఉత్తమనైతికవాంఛలను నొసఁగఁగల ప్రౌఢకావ్యమగుటచేత విద్యాశాఖాధికారులు దీనిని ఉన్నతతరగతుల విద్యార్థులకు పాఠ్యగ్రంథముగ నిర్ణయించి గ్రంథకర్తకు తగిన గౌరవము కూర్తురుగాక.

**ఆంధ్రభూమి,** శ్రీముఖ మార్గశిరము.

......ఇందలి విషయములన్నియు కేవల వర్ణనపరములే గాక సుమనోహరధ్వనిసంయుతములును, అత్యున్నతనీతివ్యాపితములునై కావ్యమున కౌత్కృష్ట్యమును సంతరించుచున్నవి. ఇయ్యది విద్యార్థికోటుల ఆదరణకు పాత్రమగుగాక.

**భారతి,** శ్రీముఖ భాద్రపదము.

తేనియ లొల్కు నీ సూక్తిసుమములు రసలాలసములగు సహృదయభృంగముల హృదయముల నాకర్షించి తేనెవాకలలో దేలించుననుటలో సందేహము లేదు.

ఈ ఖండకావ్యమునందలి కొన్ని వర్ణనములు ధ్వనిప్రధానములై కొన్ని ధ్వనిప్రధానములు కాకున్న నన్యాపదేశపరములై వాచ్యార్థచమత్కారము గలవై సదుపదేశకములగుచున్నవి.

కొన్ని వర్ణనములు మనకు నిత్యప్రత్యక్షములగు విషయములకు సంబంధించి మిగుల చమత్కారము గలిగించుచున్నవి. తెలుఁగున నిట్టిగ్రంథములలో నిది మొదటిదని చెప్పవచ్చును.

ఇట్టి యమూల్యగ్రంథము నాంధ్రలోకమునకు కల్పించిన శర్మగారు ధన్యులు.

# అంకితము

పుట్టువును సఫలము సేయునట్టి యొజ్జ
యడుగుఁదమ్ముల నర్చింతు "నడవిపూల"
మనము గురుదేవుఋణ మీఁగికొనుటకన్నఁ
గలదె యొండుకార్యంబు జగంబునందు ?

# విషయానుక్రమణిక

—:o:—


| | పేజి | | పేజి |
|---|---|---|---|
| బాస | ౧ | తుమ్మెద | ౫౨ |
| కవి | ౩ | పద్మము | ౫౪ |
| వానకోయిల | ౭ | సంపెంగ | ౬౦ |
| కోయిల | ౧౦ | గేదంగి | ౬౩ |
| మావి | ౧౩ | రత్నము | ౬౪ |
| చెఱకు | ౧౫ | బంగారము | ౬౬ |
| చందనము | ౧౮ | సింగము | ౬౮ |
| భ్రమరకులు | ౨౨ | కోతి | ౭౦ |
| బూరుగు | ౨౬ | మార్జాలము | ౭౨ |
| మబ్బు | ౩౦ | కాకము | ౭౪ |
| కొలను | ౩౬ | చందమామ | ౭౬ |
| కూపము | ౩౯ | అల్పుఁడు | ౭౯ |
| సముద్రము | ౪౧ | విధి | ౮౨ |
| హంస | ౪౬ | మేలిపలుకు | ౮౪ |
| చక్రవాకము | ౫౦ | ఆధిపత్యము | ౮౮ |

# ఒకమాట

ఆంధ్రమహాజనులారా,

ఏ డెనిమిది వత్సరములకుఁ బూర్వము నే గుంటూరు హైస్కూలులోఁ బ్రధానాంధ్రోపాధ్యాయుఁడనుగా నున్నప్పుడు సహృదయపత్రికయందలి ముఖపత్రమునఁ గల సుభాషిత శ్లోకములఁ జదివి యానందించి యాంధ్రంబున నిట్టివి లేమికిఁ జింతించి వానిం గొన్నింటిం బురస్కరించుకొని స్వకపోలకల్పితముల బహుసంఖ్యాకములం జేర్చి " యడవిపువ్వుల " వ్రాసితిని.

ఇందుఁ గొన్నింటి నింతకుమున్నె 'భారతి' తన వినీలసుస్నిగ్ధవేణీభాగమునఁ దురుముకొనిన దని మీకు విదితము.

ఎవ్వరైనను బ్రస్తావవశంబున బండితరాయాదుల శ్లోకములఁ జదివెదరు గాని లేమివలనం గదా యాంధ్రపద్యములం జదువకున్నారు.

అట్టియాస గల యాంధ్రరసికులకు నా పరిశ్రమము సంతోషదాయక మగునని నమ్మెదను.

'కుక్కమీఁది పద్యము, నక్కమీఁది పద్య' మని ముందుగనే యూసడింపక చదివిచూచి, యున్నచో నీతిసౌరభము నాఘ్రాణింపఁ బండితుల కంజలిసేసెదను.

విసువుగల్గకుండ విద్యార్థులకు నీతులం గఱప నసువైన యీ పాత్రమును విద్యాధికారు లాదరింప వేఁడికొనియెదను.

విశ్వదాత, దేశోద్ధారక, బ్రహ్మశ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు వీని నాలకించి "తెలుఁగుం జోటియడుగుంగవ నీక్రొత్తరకపుం బువ్వులు మిలమిల లాడుచు నెత్తావితరఁగల నెల్లకడల వెదచల్లుచుండుం గావుత" మని యాశీస్సు లిచ్చి యీపాత్రము నచ్చొత్తించి యిచ్చినందులకు శ్రీవారికిఁ గృతజ్ఞతావందనముల నర్పించుచుంటిని.

గుంటూరు :
శ్రీముఖ – ఆషాఢ
అష్టమి.

ఇట్లు : విధేయుఁడు,
గురునాథశర్మ

# పరిచయము

---

ఆంధ్రసారస్వత నికుంజమున నేఁడు నవ్యసుమ మంజరులు పొడచూపుచున్న వనుట రసికులకుఁ గ్రొత్త కాదు. కావ్యములే కాక ఖండకావ్యములు, భావగీత ములు, అనిబద్ధములు నూత్నరీతులతో నవ్యదీధితులతో పొడచూపుచున్నవి. ఇప్పటి యనిబద్ధ కావ్యధోరణులు మనపూర్వులకు విదితములే కాని నూత్నములు కావు. హేమచంద్రప్రభృత్యాలంకారికులు అనిబద్ధకావ్య స్వరూప నిరూపణము బహుధా యొనర్చియున్నారు. అనిబద్ధములైనను కొన్ని కావ్యములు సౌభాగ్యవిశేష ములయందు, తీరుతీయములయందు మహాకావ్యముల కూడ క్రిందు చేయఁజాలియున్నవి. అట్టి యనిబద్ధ కావ్యపరంపరలో చేరినదియే యీ "యడవిపువ్వులు."

"అడవిపువ్వులు" అనునామ మీ గ్రంథమున కెంతయు సముచితమై యున్నది. ఈ పూవు లన్నియు తీరుగా, గోముగా పెరిఁగిన యుద్యానలతావళినుండి పరువము తప్పకుండ, నవకము చెడకుండ, కోసి నిలువ చేసినవి కావు. సారస్వతగహనమున నిండుగా, మెం

డుగా, విరియఁబూచిన తీవియలనుండి కవి తన కిచ్చ వచ్చినట్లు ఏర్చి కూర్చినవి కొన్నియును, కవియొక్క యుదాత్తభావ లతావితానము ప్రసరించినవి మఱికొన్ని యును. కాని, నవకమున, లావణ్యమున, సౌరభసంపదను ఉద్యానలతాసుమమంజరులకన్న ఈ "యడవి పువ్వులు" మిన్నలై శోభావిశేషముల వెలార్చు చున్నవి. ఈ గ్రంథమునందలి కతిపయములకు మూలము గైర్వాణి. వానిని సంస్కృత ప్రాస్తావికములకు యథేచ్ఛాపరివర్తనము లనవచ్చును. మఱికొన్ని బహుసంఖ్యాకములు స్వతంత్రములు.

ఇందలివర్ణనము లన్నియు మనకు నిత్యప్రత్యక్షము లగు విషయముల గూర్చినవి.

కోయిల, పద్మము, బంగారము, కాకము, మబ్బు, చందమామ మున్నగువిషయములు కేవల వర్ణనపరములే కాక, సుమనోహరధ్వని సంయుతములును, అత్యద్భుతనీత్యుద్భాసితములు నయి, కావ్యమున కౌత్కృష్ట్యమును సంతరించుచున్నవి. కావున రసికుల కుపాదేయము లనుట పునరుక్తప్రాయము.

ఏతాదృశకావ్యపఠనముచే సహృదయు లమందానందము నంది తనుపారుచున్నారు. అట్లనుటకు సహృదయహృదయములే తార్కాణ. అయితే, ఈ

యానందకారణమేది? అని విచికిత్స. "వాక్యం రసాత్మకం కావ్యమ్" అను లక్షణమిట అన్వయింపదు, ఇచట రసమే లేదు కనుక. కావున నిట భావములే అవిదితవేద్యాంతరముగా చర్వణవిషయములై రసికుల నానందసీమలకు తార్చుచున్నవి. కావున, భావములకే ఆనందజనకత్వమును, చర్వణావిషయత్వమును అంగీకార్యము లేమో! కాదేని, "రమణీయార్థ ప్రతిపాదకశ్శబ్దః కావ్యమ్" అను పండితరాయలసూక్తియే ఇట్టి సంగ్రథనముల కాధారము కాఁగలదు.

ఈ "అడవిపువ్వులు" అన్నియు నిసర్గమధురములు, సౌరభ్యసంవాసితములు, మనోహరదళసంయుతములు. అడవిపువ్వులు సహజసౌందర్యములనే కదా ప్రోదిసేయును? కావుననే, ఈ విరు లన్నియు సామాన్యముగా తెలుఁగుతేటలనే పిసాళించుచు పాఠక హృదయముల ఆనందమరందము నొలికించుచున్నవి. అలఁతియలఁతి తెలుఁగుతునియలును, అచ్చటచ్చట నున్న సరళనాతిదీర్ఘ సాంస్కృతిక సమాసధోరణులును వియ్యము నెఱపుచు ఈ కవితాసుందరికి ఒయారినడకల శిక్షించుచున్నవి. ధార అనర్గళము. అందందునున్న వృత్తములయందలి విఱుపులుకూడ ప్రణయకోపపరవశయగు సుందరిచిగురుమోవి విఱుపులవలె ఆనందసంధాయకములే యగుచున్నవి.

మామిత్రులీతోధికము సత్కావ్యసుమమాలాగ్రథనముతో ఆంధ్రసరస్వతీసంసేవనమొనర్చి చరితార్థులగుదురు గాత.

| | |
|---|---|
| అమృతలూరు:<br>శ్రీముఖ<br>ఆషాఢ<br>అష్టమి<br>శనివారము. | విద్వాన్<br>నా. వేంకటేశ్వరశాస్త్రి,<br>విద్యాభూషణ, సాహిత్యసరస్వతి,<br>సంస్కృతోన్నతపాఠశాలా<br>ప్రధానాధ్యాపకుఁడు. |

# అడవిపువ్వులు

---

## భాస

శ్రీ రత్నములకు మధుర సు
ధారసనిష్యందివాగ్విధానమె యున్నన్
హారాదులు లేకున్నం
బూరుషు లానందములను బొందుదు రెదలన్.

అసమాన సర్వవిద్యా
భ్యసనమయిన సాహితీవిపాకము లేకు
న్న సమాజము సమజముగా
రసికులు దలఁతు రనుభావరహితముగాన్.

కవిసూక్తి వ్యంగ్యవిభవము
దవుల కలంకృతు లెసఁగినఁ దగ; దన్యోన్యా
ప్తివిశేష రమ్యమయిన న
సువు లెడలిన యొడలికిడిన సొమ్ములు వోలెన్.

మఱియొక పనికి మనంబుం
జొరనీయక తరఁగలట్లు జొబ్బిల్లుమహా
త్తరమగు నీకావ్యధ్వని
సొరఁ జెవి నన్యరవము సొచ్చునె మాకున్?

లాలనంబోలెఁ గవిత్వకన్య వివిధా
లంకార విఖ్యాతయున్
విలసద్వృత్త విశేషమంజులపదా
విర్భూత విన్యాస కో
మల విశ్వైకరసానుభావగుణసం
పద్రమ్య విస్తారని
ర్మలభావాఢ్య విరాజదూర్జిత సువ
ర్ణ శ్రీక విద్వద్వరా!

కొలకున్ లొంగని పూర్వప్రాయపుబెడం
గుల్ వొంగుచోఁ బ్రాకృతం
బల వార్ధక్యమునన్ శ్రుతిస్మృతు లగ
ణ్యానన్యలావణ్య పు
ష్కలతారుణ్య దశావశంబునఁ గన
త్సాహిత్య సాహిత్యమున్
బలుకుం జిల్కల కొల్కి పల్కెనని సం
భాషింత్రు భాషావిదుల్.

* * * *

# కవి

ఏపదంబులు మనచే రచింపఁబడునో?
ఎట్టియర్థము ల్మనకు నూహింపఁబడునో?
ఆపదములై యాయర్థములే పటుత్వ
విరచనావిశేషములఁ గవిప్రవరుల
వలనఁ బలుకంబడి జగంబు నలరఁజేయు.

ఔర! వక్రోక్తులఁట యలంకారములఁట!
అలఁతులంట వాక్యార్థబోధలు; వచింపఁ
దగినయర్థంబులం దభిధ దోసఁగంట!
సుకవుల తెఱంగ దేమొకో చోద్యమయ్యొ!

పదముల్ వ్రానెదు మెల్లఁగా, నచటి శ
        బ్దంబుం బరీక్షించెదున్,
మది నర్థాహరణాభిలాష యెసఁగున్,
        నానావిధాలంకృతుల్
గొదలేకుండఁగొనున్, సువర్ణతతిలా
        గున్, దా రసవ్యగ్రుఁడౌఁ;
మదిదోషాంతముఁ బాఱఁజూచుఁ గవిచం
        ద్రుండౌర దొంగంబలెన్!

రసికుల్ గొందఱు వాక్కునన్, మృదుపదా
ర్థశ్రేణినిం గొంద, ఱా
రసి శబ్దంబునఁ గొందఱున్ రసము గూ
ర్పంజూతు ; రట్లేగదా
వసనావాప్తిఁ గుబిందుఁడున్, రవణమున్
వైదేహకుండున్, సము
ల్లసదాకారముఁ గోడెకాఁడు, తమిగు
ల్కన్ స్త్రీయెడన్ గాంచెడిన్ .

కొందఱు లోభిచందమునఁ
గొల్చెద రర్థము ; నయ్యలంకృతుల్
గొందఱు వేశ్యవోలెఁ గయి
కొందురు ; కొందఱు ధాతువాదిరీ
తిం దిలకింత్రు సద్రసత
తిం ; దగునర్థ మలంకృతిన్ రసం
బుం దులఁదూఁగఁ జేయుదురు
పూజ్యులు కొందఱు సత్కవుల్ కృతిన్.

విమలవిద్యకు ఫలము పవిత్రబుద్ధి ;
దానిఫలము రసగ్రహణానుభావ ;
మందుకు ఫలంబు సత్ఫూర్తిఁ బొందునేఁత ;
బుధులవాక్కుల కెవ్వారు ముదము గనరు ?

సకియల మోమునంబలె దో
సంగు పొసంగని సత్కవీంద్రవా
క్కురమునందు బింబిత మ
మోఘగుణంబగు సవ్యవస్తు వా
త్మకు ముదముం బొనర్చెడిని,
దద్యగళంబున దోషకల్మషం
బొకఁడయినన్ ముదంబుఁగన
నోపరుసూ రసికాగ్రగణ్యులున్.

కనులం జూచినదానినేని నుడువం
గా లేరు శబ్దంబు లీ
సున స్వాధీనముగామి; వారు సుకవి
శ్లోకార్థ మాయాసముం
గనుచుం; ధన్యులు నిశ్చలాత్ములు సమ
గ్రగ్రంథ కూలంకషుల్
గనులన్ మూసి సుఖంబలెన్ రసముఁ ద్రా
గన్నేర్తు రొక్కుమ్మడిన్.

ఏదియో? ఏడనో? ఎప్పుడో? దొసంగు
కలిగెనండ్రు తొల్లిటి యలంకారవిదులు;

అన్ని పొత్తములం దుండునదియ కాదె ?
మొదలు కవిజీవనమె దోషములకు నెలవు.

పదములకూర్పు, వాక్యముల
వైఖరి, సద్రసపుష్టి; యర్థసం
పద, నవభావ విస్ఫురణ,
వ్యంగ్యవిలాసము, పద్యలక్షణం
బెది విడిపోవునో? యనుచు
నెన్నియొ భంగులఁ జూడనా విశా
రదులగు సత్కవీంద్రులకు;
రాజుల కీవగ లెల్ల లేవుగా !

సిరులు నదృష్టమేఘములఁ
జెందిన చంచల, లెవ్వ రాఁగనే
ర్తురు ? నిరతప్రయాణముల
తో నసువుల్ నిలువంగఁబో, వహో!

నరవరులార ! కావ్యసుధ
నవ్యయశోమయకాయముం బరి
స్ఫురణము సేయు సత్కవులఁ
బూజ్యుల నోజ్జలఁగొల్వఁ డర్హులై.

*　　*　　*　　*

# వానకోయిల

చాతకమా! వెంటఁ జనుచుంటి వేల?
నీతండు ఘనుఁడుగాఁ డిభమదాంధుండు,
ఖ్యాతిగ నీవంటి కవుల కొసఁగఁడు
మాతంగదానమ్ము మధుపాళిపాలె.

పొందిక విన్ము నాపలుకుఁ
    బోలిక నెచ్చెలి! వానకోయిలా!
ఎందఱో మింట మేఘులు వ
    సింత్రు స్వభావ విభేద మొప్పఁగాఁ,
గొందఱు వృష్టిచేఁ బుడమి
    కుందు నడంత్రు; వృథాగ గర్జలం
గొంద ఱొనర్తు రట్లగుటఁ
    గోరకు చూచినవారి నందఱన్.

ఇమ్మా! ఇమ్మా! జలము ఘ
నమ్మా! నమ్మినఁ జెఱుపఘనమ్మా? సారం
గమ్మా దప్పింబడలె, క్షు
ణమ్మాఁగిన నెట్టివార్త నాచెవిఁబడునో?
ఇచ్చెదవా? లేదా? జల
మచ్చము జలద! నినునమ్మినది చాతకమే

అన్నిపొత్తములం దుండునదియకాదె ?
మొదలు కవిజీవనమె దోషములకు నెలవు.

పదములకూర్పు, వాక్యముల
వైఖరి,సద్రసపుష్టి; యర్థసం
పద, నవభావ విస్ఫురణ,
వ్యంగ్యవిలాసము, పద్యలక్షణం
బెది విడిపోవునో? యనుచు
నెన్నియొ భంగులఁ జూడనౌ విశా
రదులగు సత్కవీంద్రులకు;
రాజుల కీవగ లెల్ల లేవుగా!

సిరులు నదృష్టమేఘములఁ
జెందిన చంచల, లెవ్వ రాఁగనే
ర్తురు? నిరతప్రయాణముల
తో నసువుల్ నిలువంగఁబో, వహో!
నరవరులార! కావ్యసుధ
నవ్యయశోమయకాయముం బరి
స్ఫురణముసేయు పత్కవులఁ
బూజ్యుల నోజ్జలఁగొల్వుఁ డర్థులై.

* * * *

# వానకోయిల

చాతకమా! వెంటఁ జనుచుంటి వేల?
నీతండ్రు ఘనుఁడుగాఁ డిభమదాంధుండు,
ఖ్యాతిగ నీవంటి కవుల కొసఁగఁడు
మాతంగదానమ్ము మధుపాళిపాలె.

పొందిక విన్ము నాపలుకుఁ
బోలిక నెచ్చెలి! వానకోయిలా!
ఎందఱో మింట మేఘులు వ
సింత్రు స్వభావ విభేద మొప్పఁగాఁ,
గొందఱు వృష్టిచేఁ బుడమి
కుందు నడంత్రు; వృథాగ గర్జలం
గొంద ఱొనర్తు రట్లగుటఁ
గోరకు చూచినవారి నందఱన్.

ఇమ్మా! ఇమ్మా! జలము ఘ
నమ్మా! నమ్మినఁ జెఱుపఘనమ్మా? సారం
గమ్మా దప్పింబడలె, క్ష
ణమ్మాఁగిన నెట్టివార్త నాచెవిఁబడునో?
ఇచ్చెదవా? లేదా? జల
మచ్చము జలద! నినునమ్మినది చాతకమే

స్వాచ్ఛ్యము గలిగిన దగఁజేఁ
జచ్చునుగా కొరుల వేఁడఁజాలదు సుమ్మా.

నిరవలంబనమ్ముగ నింగి నిలిచి నోరు
దెఱచి దీర్ఘకాలమ్ము ప్రార్థించు చాత
కమునకు న్నీటిమాటకేమి? మధురస్వ
నమ్మునైన విస్పింప వభ్రమ్మ యేల?

నిన్నడిగి వానకోయిల
కన్నుల నెన్నింటి నశ్రుకణముల వదలెన్
దిన్నఁగ జలకణముల నీ
వన్నింటింగూడ నీయవైతివి జలదా!

చాతకపోతకములు తమ
కై తమకముతోడ వేఁడఁగా జలమును జీ
మూతుఁడు సమస్తభూతల
భూతమ్ములుగూడఁ బ్రీతిఁ బొంగ నొసంగున్.

వనధి నదిన్ సరస్సునను
బల్వలమందు మఱెందునైన జీ
వన మెలయించుకొన్నఁ దల
వంచి భుజింపఁగనో నిదెంత నై
చ్యనిరతియం చటుల్ సనక
చాతకసంతతు లంబుదా! నినుం

బనలేదు సట్టులెత్తి; తల
వంపులమన్కిఁ గవుల్ సహింతురే?

ఎవరిఁ బరులఁగోరక, ఘనుఁ
డవుగద నిక్షేపమేదొ డక్కననుచు ను
న్నవి చాతకములు, నోటం
జివర కకట! పిడుగెపడునొ? చినుకే పడునో?

వాపి స్వల్పనీరము, సరోవరము విషమ
యమ్ము, నీచావగాహమ్ము హ్రదము, పాద
జలము త్రిపథగ, వారిధి క్షారనీర
మగుటనో, చాతకము ఘను నడుగు నీరు.

పిల్లలుగలవాఁడను, గవి
తల్లజుఁడను, బీదవాఁడ, దాన మొసఁగు మం
చుల్లంబు గరఁగఁ జాతకుఁ
డొల్లిన వినఁడు, ఘనుఁడెట్టులో దాతయ్యెన్.

నోరుకాయగాయ నుతిచేసిచేసి నీ
వింతలోఁ నెచటి కేగితమ్మ?
చాతకమ్మ! ఘనుఁ డొసఁగిపోయె జలః; మద్భ
ప్టరహితులు నెనందు చక్కఁబఱుచు?

* * * *

# కోయిల

ఎంతయుఁ బండకున్న నెది
    యే నొకయేఁడు రసాలసాల, మొ
క్కింతయుఁజూడఁబోదు కర
    ఇష్టముఁ బండిన నింబవృక్షముల్
వంతవచింప కేరికిని
    వాడుచు శోషిలుచున్ ఫలప్రజా
క్రాంతరసాలము న్నెమకుఁ
    గాక పికంబది సారెసారెకున్.

లేదర్థంబు, స్వరంబులేదు, శ్రుతియున్
    లే, దక్షరాబద్ధముం
గా, దభ్యస్తముగాదు, లాక్షణికముం
    గా, దైననేమీ? మహా
హ్లాదంబుం గలిగించి, తన్మయులఁ జే
    యంజాలు మహ్మార! నీ
కీ దివ్యామృత మొల్కుపాట పికమా!
    యెట్లబ్బెఁ జైత్రంబునన్?

వానకోయిలయఁట! మ్రానుగోయిలయఁట!
యెట్టిపేర్లు నేఁడు పుట్టెనమ్మ!

అంతమాత్రముననె యఖిలరంజన కళా
విలసనములు దమకుఁ గలిగె నొక్కొ ?

పికమా ! కలస్వనము నో
పిక మాచెవి నిడుచుఁ దీయ విరిమామిడిఁ జూ
డకుమా ! దోననిశితశర
ప్రకర మలర శబరుఁ డిదిగొ వచ్చుచునుండెన్.

బధిరు లున్నెడఁగోయిలా ! మధురమైన
నీకుహూకార మలరారుఁగాక యేమి ?
ఆకృతింగని కాకమ్మవనుచు నిన్ను
నందు రజ్ఞులు దైవోపహతులు వారు.

కాకులసభ దైవికముగ
నీ కునికి ఘటిల్లెనేని నిర్మలగీతిం
బైకము ! వెలికిం జూపకు
మా ! కీర్తికి బదులుగ నపహాస్యము కలుగున్.

కాకుల మూఁకల లోపలఁ
గోకిల మెలసినను మధుర కోమలగీతిన్
జోకసెడునె ? కఠినరవం
బే కళ్యాణప్రకృతికి హీనులమైత్రిన్ ?

ఎల్లపుడు మావితోఁటలఁ గొల్లగొట్టి
పల్లవోల్లలన్మంజరి నుల్లసిల్లి
దైవికముగ వేములఁబడ్డ కోవెలలకు
రుష్టబలిపుష్టములకు షష్ఠాష్టమంబు.

*　　　*　　　*　　　*

# పూవి

ఎన్నిలతలు గొమ్మలు లేవు క్రొన్ననలను
గుసుమవిసరములను ముద్దుగొలుపునవి? మ
నోజ్ఞకళికాళికావాలనుతవిశాల
ఘనరసాల సాలమువలెఁ గావుగాక.

విరితేనెయు నెఱితావియు
నరవిప్పం బొరయుతమ్మి నచటవిడిచి నీ
సరసంగనెఁ, గ్రొమ్మావీ!
పరికింపుము భృంగము నుపవాసముదీరన్.

పువులం బూయుటకంటెఁ బూర్వము మొదల్
పూజించు భృంగంబు ని
న్నవురా! యిప్డుఫలాభివృద్ధిఁ గని డా
యన్ రాఁగ మాటాడఁ బూ
నవు; కీటంబులు నీమొగం బెఱుఁగవై
వం బండ్లలోఁ జేర్చు జం
కవు; ఛీ! చూతము! తారతమ్యసువివే
కం బేది నీ కాత్మలో!

మివుల సుధారసోపమస
మృద్ధఫలంబులఁ దొప్పఁదోఁగి పొ
ల్తువు, ఫలమేమి? తద్గ్రహణ
లోలురదండ శిలాభిఘాతముల్

దవిలేదు; బిడ్డలంగనిన
లాభమెకో? యిది మావిగున్న! యీ
భువినెవరైన సౌఖ్యములఁ
బొందరె బిడ్డలకారణంబునన్?
కమ్మని పండ్ల చాగమునఁ
గ్రాలెడి తీయని మావిమ్రాఁక! భృం
గమ్ములు గోయిలల్ విరివి
గా భవదీయ యశంబుఁజాటుచో
నమ్మకచెల్లు! తాలము త
నంతనె గాలికి నూఁగులాడు ప
ర్ణమ్ముల గల్గలార్భటి ని
రంతర మాత్మయశంబుఁ జాటెడిన్.
దిక్కులనెల్ల నింపితివి
తీరుగ సౌరభసారపూరముం
జక్కఁదనాల కిక్కవయి
చాలితి కన్నుల కింపునింపఁగా
నక్కట! మావిపండ! యన
యంబు భవద్హృదయంబు సూడ స
మ్యక్కఠినంబు గ్రంథిలము
నందున నొందితి నింద నెందునన్.

*      *      *      *

# చెఱకు

నఱుకంగానగుఁ దుండెతుండెములుగా
    నజ్జైస్వరూపం బఱిన్,
గఱకుంగానుగవైవఁ గావలయు ని
    ష్కారుణ్యతం, గానిచోఁ
చెఱకా! బెల్లము వెట్టుమంచు నరుఁడుం
    జేసాఁచఁగాఁ బెట్టుదే?
వెఱపుం గొల్పినఁగాక సామమున ను
    ర్విం గార్యముల్ సాగునే?

ఓరీ శూన్యహృదయ! త్వ
క్సారా! నేఁగూడఁ దుంగకాయుఁడనని ఛీ
నీరంధ్ర మ్మగు నంత
స్సారము గల చెఱకుతోడ జగడంబటరా?

ఒరులకుఁగాఁగ బాధవడు
    చుండి, వికారశరీరమైన నె
వ్వరికిని వాంఛనీయవయి
    భంగములందునుగూడ మాధురీ

స్ఫురణము పూని పొల్చెదవు
  పో, చెలికా! మరుభూమి వృద్ధినిం
దొరయవటన్న నెవ్వరిది
  దోస? మపాత్రపు నేల దయ్యెడిన్.

భళిరే! ఇక్షువ! స్వస్వరూపమున స
  ర్వప్రాణులం బ్రోతు వన్
పలుకట్లుంచు; కఠోరచిత్తులు నినున్
  బాధించుచున్నన్ రసో
జ్జ్వలరూపంబును, ఫాణితాకృతి, గుడాం
  చ చ్ఛర్కరాకారముల్
వెలయందాలిచి మేలు సేసెదు, భవ
  ద్వృత్తిం బ్రశంసించెదన్.

కట్టిఁడినల్వచెయ్వులకుఁ
  గారణముల్ గనుపట్టకుండుఁగా
అట్టి రసార్ద్ర చిత్తునకు
  నట్టి మహోన్నతభావశీలికిం
బుట్టుకదొట్టి మానవస
  మూహసపర్యలఁ జేయునట్టి నీ
కొట్టిడినట్టు లో చెలిక!
  యొక్కఫలంబును నీయఁడాయెఁగా!

పాప మిరుగుపొరుగువారలం జూచి య
శ్లైన ఫలము గలుగు నన్నయాస
చే 'రసాల' మన్న పేరు దాల్చితి వట్టు
లైనఁగూడ ఫలము నందవైతి.

*    *    *    *

# చ ం ద న ము

డెందము శూన్య, మంగము ప
టిష్ఠము నైతగు దుష్టవంశముల్
బృందములై పరస్పర ని
విష్టనిఘర్షసముద్భవాగ్నిచే
నెందు స్వవంశముం దెలుప
నేల ? వనంబునెకాల్చు ; మానవా
నందన చందనా ! మలయ
నందన ! యీచెలిమిం దొలంగుమా.

కొమ్మలపై విహంగములు,
కోటరమందు భుజంగముల్, ప్లవం
గమ్ము లొగిన్ సిగన్, వికచ
కమ్ర ఘుమంఘుమ గంధనవ్య పు
ష్పమ్ముల భృంగముల్, చెలఁగుఁ
జందనపాదపమా ! గణింప శ
క్యమ్మె మాకు, నీతనువు
నం దెట లేవు వనీపకావళుల్ ?

కాంతాస్వైరవిహారకేళి కుపయు
క్తంబౌ తరుల్, తేండ్లకున్

సంతోషంబును గూర్చుభ్రమరాళికులు, ఫలా
న్నత్యంబుచేఁ ద్రుప్తివి
భ్రాంతుల్ గొల్చెడి చెట్లు నీసమమె? భ
ద్రశ్రీద్రుమంబా, భవా
త్యంతోష్ణంబును బాపనేర్తు స్వతనూ
త్యాగోపకారమ్ముచే.

కొల్లగ నెల్లదిక్కులను
గొల్లలు గొట్టెదు నీ పరీమళా
భ్యుల్లసనంబు పిల్వ మల
యోద్భవమా, చనుదెంచినాఁడ నీ
మొల్లసిరుల్ గనుంగొనఁగ,
నే మిట నుండెను? దొట్టులోపలన్
నల్లనిపాముగాక; యిఁక
నన్విడు, నీకు శుభంబు, పోయెదన్.

మోటుతండ్రి; కొండపొలము కాఁపురము; ద్వి
జిహ్వాకులముతోడి చెలిమి; మొండి
కట్టెజాతి; మైనఁగానిమ్ము చందన
మా, స్వసుగుణములనె యసముఁ గంటి.

కంటికిఁ గడివెఁడుగా నేడ్చు కులకాంత
గడపదాఁటియుఁగూడఁ గదలిరాదు

కడుపు చుమ్మలుచుట్టఁగా వంపి రెడుతల్లి
    కాటివఱకుఁగూడఁ గదియరాదు
గడియించు సర్వంబుఁ గైకొన్న సుతుఁడెల్ల
    కాలుదాఁకంగూడఁ గాంచఁబోఁడు
కడుమేళ్లు తనచేతఁ గన్నవారు తిలోద
    కము లొసంగుటకేని కానఁబడరు.

ఔనె, బ్రదికినన్నిదినాలు సాసఁబట్టి
నట్టి గృహమేధి దొఱఁగి కాయంబు చితిని
గాలుచుండఁ దోడుఱికి యంగంబు వాయు
చుందు; నీవంటివా రేరి చందనంబ!

పాపిష్ఠమనుజులు దురా
శాపరులయి స్వీయలాభసంపాదన క
య్యో! పాపము! నీరూపము
మాప మురియుచుంద్రు సిగ్గుమాలి మలాకా!

భళిరే! ‘యెంతటిదైవభక్తిపరుఁ డీ
    పాటీరుఁ’ డంచన్న ని
స్తులకీర్తిం గననో బలిష్ఠు నొక మొ
    ద్దుఁ శ్రీజగన్నాథుకై
జలమార్గంబునఁ బంపుదంట, మఱి వే
    సంగిఁ నృహార్యర్చనా
దుల సింహాచలమందు నుందువఁట! యెం
    దున్నేలె ప్రత్యాశయున్ ?

నీమూలంబున నాకృతిం బడసి నీ
నీడం బ్రబర్ధిల్లి నీ
యామోదంబును బొంది నీసముఖమం
దావాసముం జేయు నీ
వేముల్ లోనగు నన్యజాతితరువుల్
వేలోకముం జొచ్చి య
య్యో, మేమేసుఁడి చందనాఖ్యుల మటం
చున్నారయా, చందనా!

నీపేరు చెప్పుకొని యె
న్నో పాట్లంబడుచు బ్రదుకుచున్న వగవఁగా
నీపేరునకె కళంకం
బాపాదింప నోరు, లెట్టులాఁగుదు నఖుఁడా!

ఘ్రాణతర్పణంబు గావింపలేని నీ
నామధారకులను నరులు నమ్మి
పేరు గొప్ప గాని యూరు దిబ్బయటంచుఁ
బలుకఁ జొచ్చి రెంతభంగపాటు!

అరయఁ గర్ణుఁ డవ్యుత్పన్నుఁ, డప్రయోజ
కుండు వారివాహుఁడు, దేవ కుజములు విష
మహితములు, చూడఁగ భవత్సమాను లెవ్వ
రయ్యా, చందన, దానవీరాగ్రగణ్యా!

*  *  *  *

# ప్రాఁకులు

పండిన పండ్ల మెక్కుచును
భద్రముగా వసియించుచుండు నీ
యండను జేరి కోటరము
నందు విహంగము లెన్నియేని ; య
ట్లుండియు నీటివేగమున
నుక్కిరి బిక్కిరిగా భ్రమించు నీ
గండము సూచుచుండెడిని
గట్టు ! తటస్థములై తరూత్తమా !
మొదట న్నీడ నెలర్చి యావల సుమం
బుల్ గూర్చి యాపై రుచి
ప్రదముల్ పండ్ల నొసంగి యంతఁ బథిక
వ్రాతంబు సౌఖ్యంబున
న్మోదలంజేయుదు ; కాని యెవ్వఁ డెఱుఁగు
న్నీకోటరంబందు ను
న్మదహాలాహలకేలికా ప్రకర వ
క్త్రవ్యాళ వాహ్యాళులఁ.

స్థూలమగు మూలల, మధికబంధుర పరస్ప
రానుబద్ధము శాఖాచయమ్ము, మాంస

లమ్ము త్వత్కుక్షి, నీకేమి భయమ్ము తరువ !
కాంచననియొ దావానల ఘస్మరుండు ?

జననంబేల చతుష్పథంబున, సరే
ఛాయ న్విడంబింప నే
ల ? నితాంతంబు ఫలింపనేల ? ఫలముల్
గన్న న్వినమ్రుండవై
తనరం జెల్లునె ? కావునంగద తరూ
త్తంసంబ, శాఖావిపా
టనము న్మోటనముఁ లభించెడిని దు
ష్ట శ్రేణిమూలంబునఁ.

తీయనిపండ్లఁ బత్రములఁ
దేరిన నీడలఁ బూల నేరికిఁ
సాయము సేసితో మునుపు
త్స్మోజమ, వా రిపు డేరి ? నీ వెతం
ద్రోయఁగఁ ; బైని నంటుమెయిఁ
బ్రోదినిగాంచుటఁ దొల్తకాయముం
బాయును గొడ్డటం బెరడు ;
ప్రాణుల కీగుణముల్ సెలంగునే ?

మచ్చిక గంధవాహునకు
మారునిచేఁ బిలిపించి చాయకు

న్వచ్చినయాచకావళికిఁ
బచ్చికరెమ్మల మంచునీరు నం
దిచ్చి సుపాద్య మీప్సిత స
మృద్ధఫలంబుల నిచ్చుమాఁక, నిన్
గ్రచ్చపొదల్ పదంబులఁ బె
నంగొనుటల్ గని యెట్టు లోర్చుటల్?

'పురందరుని యంతవాఁ డడిగెఁ
బో ననుం దీనుఁడై
కరంబులను జాఁచి నిర్భరముఁ
గల్మషోద్వేగముం
బరిగ్రహణ మాచరింప' నని
వాగదే కాని వా
హ్వారే! బదులుగోరవే వరము
వాని, వృక్షాగ్రణీ!

చెప్పెద నొక్కమాటఁ జెవిఁ
జేర్పవె వృక్షమ; వృత్తిమార్పవే;
ఎప్పుడు యాచకావళి క
భీష్టపదార్థచయం బవారిగా
గుప్పుచుఁ గీర్తికాంతయుప
గూహనముం గొనుచుందుగాని నీ

చెప్పదు స్వప్నమందయిన
　　నెంచకె కంటకపాళిఁ గూడఁగన్.

‘మానవసేవ సేసెదము
　　మానక మే మనుమాన మూన, క
ట్లైనను నిర్దయాత్ములయి
　　యక్కట! హింస యొనర్ప సాగి రీ
మానవు’ లంచు నెంచెదవు
　　మ్రాన, దోసం గది మీదె; మీకుల
స్థానుఁడు మొండికట్టై చొర
　　సాగెనయా, పగవాని గొడ్డటన్.

* * * *

# బూరుగు

బూరుగు లెట్టిదైన తమ
పువ్వులఁ గోకనదంబు గెల్వఁగాఁ
గోరునుగాక రూపమది
కొండొకయుండిననేమి; యుండునే
సౌరభవైభవంబు, విల
సన్నవమాధ్వి, ప్రశస్తమాధురీ
సారము, చంచరీకకుల
సంచయరంజన చాతురీగతుల్?

కన్నులపండువయ్యెఁ బూడఁ
గన్నభవత్కుసుమోన్నతిన్ ఫలం
బెన్నఁడు దీనికిం దగిన
దేర్పడునో? యని గంపెఁడాసతో
నున్నశుకంబుగుండె పది
యుంబదిగాఁ బ్రిదిలెన్ శలాటువై
క్రన్ననఁ బండి విచ్చి వలి
గాడ్పుల లోపలి దూది లేవఁగన్.

కీరమ్ముల్ సుఫలాశచేత, బలిభు
గ్గృధ్రాళి మాంసాశచే,

సౌరభ్యప్రబలాశ భృంగములు, క్షు
చ్ఛాంత్యర్థమై పాంథులున్,
దూరంబం దటఁ గాంచి నీసుమతతిం
దోతెంచి రుద్భ్రాంతి పా
ల్పారన్, శాల్మలి, నిత్య మెందఱ నిటుల్
వంచించుచున్నాఁడవో!

ఆమూలాగ్రము కంటకావృతము, గం
ధానన్వితంబుల్ సుమ
స్తోమంబుల్, క్షుధఁ బాపలేవు ఫలముల్,
స్తోకశ్రమంబైన ఛా
యామాత్రంబునఁ బోదు, నీ యునికి యే
లా త్రోవలో, శాల్మలీ,
ధీమత్స్నేహవిహీన, యన్యఫల వ
ద్వృత్తాళి మాయింపనో?

పంతములాడి 'నేన బల
వంతుఁడ; న న్గదలింతువే నభ
స్వంతుఁడ!' యంచు బూరుగ, స్వ
శాఖల నీకయిఁ ద్రుంచుకొంటి దు
ర్దాంతపరాక్రమక్రమ వి
దారితభూరుహుఁ డౌచు వాఁడు రా;

నెంతటి బుద్ధిహీనుఁడవో
యీవు గ్రహింపవు స్వీయనాశముఁ!

పున్నెంబో, పురుషార్థమో, జనములుం
బోరాని కాంతారరా

శి న్నీ వర్వాదివేలయేండ్లు వృథగా
జీవింతువో శాల్మలీ!

ఎన్నండైనను బూర్వజన్మమున మే
లే సేయవో; లాఁతినే

య న్నీవోర్వవో; పొట్టకుం దినవో; క
ట్టా! యెట్టి చెట్టైతివే!

చేతనైన మేలు సేయు మన్యులకుఁ గా
దేని వడిగఁ బంపు మింతె కాని
రిత్తపండ్లఁజూపి రేఁపి నోరూరించి
తుదకు వృథగఁ బంపుటది ఘనంబె?
ధనమో లేదు; కళావిల
సనమో లేదు; విభవాతిశయమో లే; దే
మని నీకొమ్మల కింతగ
మొనసెను బెళుచుందనంబు బూరుగుచెట్టా!

డాబుల్ గొట్టెద 'వేనెకా ఘనతరుం
డఁ, సుస్థిరుండఁ, బరుల్
డ్రాబల్, మొద్దులు, నాకు వారికిని భే
దం బెంతయో' యం చహో!
నీబండాలము నే మెఱుంగమఁటరా!
నీ కెన్నిరా త్రోళ్ళు! లా
రా! బుద్ధుల్ పెడవట్టె; నున్నతుల మా
ర్గం బిద్దియా శాల్మలీ!

*   *   *   *

# మబ్బు

నవల న్మ్రాకులఁ గూర్చితౌ హరితవ
   ర్ణ చ్ఛన్నలం జేసి; యం
త సదీకాంతల నల్లనన్ మెలపి తౌ
   నవ్యాంబరాడంబరం
బున సింధ్వీశుని జేరఁ, దారలను సం
   పూర్ణేందు వాక్రువ్వనే
ల? నటత్పద్మినిన్ రవిం గలుప వే
   లా గర్జ లంబుప్రదా!

మబ్బా, మబ్బా నీకును?
గొబ్బున నడికడలినుండి కొని తెచ్చి జలం
బిబ్బడిగఁ జవిటి నేలల
ద్రొబ్బెదు, కల్పకుజ మానతోఁ గనుచుండన్.

ఇచ్చె జలముమాత్రమ్మున్;
వచ్చె జగత్ప్రభుత మేఘునకును; సవితయున్
నిచ్చలు కరములు సాఁచుచు
వచ్చుటఁ గద చూడరానివాఁ డయ్యె భువిన్.

జలదా, నీదానంబున
సలలిత కిసలయయుతములు సర్వద్రుమముల్

భళి భళి ! మాజిల్లేళ్ల కుః
దొలుతటి యాకులకె బెడఁద దొడరెంగదరా!

భాసుర సత్పథక్రమముఁ
బాడొనరించియు, రాజహంస ప
ద్మాసన సంస్థితిం జెఱిచి
యంతటఁ బంకకులంబుఁజోపి వి
శ్వాసవిహీన, మిత్రవసు
సంతతి గుప్తముసేసి 'నాకు నే
నేసరి, నే ఘనుండ' నని
యేటికిఁ బొంగెదు మిన్నుముట్టఁగాఁ,

ఏకడఁ గన్న భేకముల
యేడుపు, లబ్బక రోదనాలె; సూ
ర్యాకృతి గానరాదు; జగ
మంతయుఁ బంకమయంబు; రాజహం
సాకులతఁ వచించుటకె
యంతములే; దిదియేటి పొంగుపా
టోకదె? మింటనాడెడిఁ గ
డుఁ ముదిరుం డిఁక నెంతకాలమే!

నెఱదాతవు గావయ్యా,
మెఱమెచ్చుల దాతవే సుమీ; నీ వీవిఁ

బరమార్థంబుగఁ జేయక
పరులెఱుఁగం బొగడఁ జేయువాఁడవుగాన౯.

ఏమో పొంగెదు 'నాకు సాటి గలఁడే
యీవి౯ జగంబందు' నం
చో మేఘుండ, సమస్తజీవనము స్వా
దూదంబునం బొంది యు
ద్దామ స్పర్శన గాఢఘాతములఁ గా
దా దాతవై తీవు? నీ
కేమాత్రంబును దోఁడఁబుట్టినవిగా
వీ త్యాగ వైదగ్ధ్యముల్.

చిరికింగొనక నీ౯, జేసాఁపకున్న శు
క్తికిఁ బొట్టనిండ ముత్తెములు పోసి
'ముట్టకు మమ్మం'చు మోమువాల్చిన పద్మి
నులకుఁ జిత్రపురత్నములు దగిల్చి
'మీయాశ్రితులమె సుమ్మీ' యన్న ద్విజులమొ
గాన నెంగిలిచేయి గసరి విసరి
'లేనివారల మండలేనివారల మాదు
కొ'మ్మన్న హంసలఁ గోపగించి
నీకృపారస మెంతయే లేకయున్న
నయ్యొ, మాఁడిపోదురు బిడ్డలన్న యుర్వ

రాలతాంగి పొట్టఁబగిల్చి జాలిలేక
యుఱిమెదవు మేఘుఁడా, యిదియును [ఘనంబె?

సప్తసాగరమ్ములు నిండఁజాలునట్టి
నీ వొసంగు జలమ్మును ద్రోవలోని
చిన్ని చెలమ యొసంగు దోసెఁడు జలమ్ము
తుల్యము సుమీ సఖుండ, పాథోధరుండ!

చెఱువులఁ గుంటల గుడిగో
పురముల నిర్మింపకున్నఁ బోనీ వగవఁ
జెఱిచెద వారు లొనరింపఁగ
హారియశ్వోరసమ, యేమనందును నిన్నుఁ?

ఇంకొకమారు సాలుఁ దడి
యెత్తినఁ బండుఁగదయ్య, స్వామి; నా
వంకఁ గటాక్షముంచు మని
పల్కు కృషీవలు పొట్టఁ గొట్టితే
జంకక గాలివాన విర
సంబుగఁ జోపి సమస్తసస్యముల్
గ్రుంకఁగఁ జేసి ద్వీపవతిఁ,
గూడునె ద్రొక్కినచేయిఁ గోయఁగాఁ?

ఎట్టిక్షమ! పిడుగునకున్మర్
దొట్టు నుఱుము దానికిమును దొడరు న్మెఱు
గొట్టకమును దిట్టు బుధుఁడు [మర్
తిట్టకమును గంటి కెఱుఁపుఁ దెచ్చు నమనటుల్.

తిప్పలకూఁతు లౌ నదులఁ
దిన్నఁగ నిల్వెడలించి యెల్లెడల్
ద్రిప్పుచు భంగపెట్టి పయిఁ
ద్రేలెదు కూడదు 'ఘోష'యంచు నీ
వెప్పుడు విద్యుదంగనను
నిల్వెడలింపక ఘోషపెట్టు దీ
చెప్పుటలేమి యన్యులకుఁ,
జేయుటలేమి పరప్రతారకా!

నీలని-చోళసంవరణ
నిష్ఠ గృహంబున నెంత దాఁచినన్
లోల కటాక్ష పఙ్క్తిఁ ద్రుటి
లోనఁ గనుంగొనిపోయెసుమ్మ నీ
యాలి తుణప్రభాతరుణి
యంబుద, కృష్ణను గంకణాల, ము
త్యాలసరాల శుక్తిమతిఁ
దన్పి రహస్యములాడు నీవగల్.

# అ డ వి పు వ్వు లు

ఉన్నమ్మకె యున్నమ్మయు,
మన్నమ్మకె లేనియమ్మయుం బెట్టునటుల్
మున్నీటికె మిగుల న్నీ
పున్నదులుంగూడ జలము వోయుట ఘనుఁడా!

*        *        *        *

# కొలను

జలజమ్ముల్ శిశిరమ్ముచేఁ, గమఠమ
త్స్యస్తోమముల్ ధీవరా
దులచేఁ, బోయలఁ బక్షులున్, దపనుచేఁ
దోయంబు, నాళంబు హ
స్తుల, శాలూకచయంబు పోత్రులఁ జనెం
దోయప్రదా, నామమే
నిలిచె న్నాకు సరస్సునా, నొసఁగుమా
నీరమ్ము నిండారఁగన్.

మునిఁగెం జక్కని మెట్లు; లేఁగసవుదు
బ్బుల్ ద్రోవలం గప్పెఁ; గ
మ్మని నీరంతయుఁ గల్మషం బగుడు హం
సల్ మెల్లగా లేచిపో
యెను; బద్మమ్ములు నీటలోఁగె; నడఁగెన్
భృంగాళికి న్మాధురీ
ధ్వని; కాసారము, వర్షవృద్ధివిభవ
భ్రష్టుండవై తేమనన్!

లక్ష్మీవంతుఁడవని శుభ
లక్ష్మమ్ములఁ జూచి నీకెలను జేరిన త్యా

క్తతమ్మోజముఁ గవి గణముగ
సూక్ష్మమ్ముగ సత్త్వసీవు సూచుట, కొలనా!

అప్పుడప్పుడు దర్శించునట్టి సాధు
వుల కసాధువులకు సమంబుగనె జీవ
నమ్ము గూర్తువు; సతము నిన్నమ్మి సేవ
సలుపు దరికి భంగచపేటములొకో, కొలన!

వనటం గూటికిఁ బొందు నాకలువదుం
పం దెచ్చి యెట్లో స్వాజీ
వనమం దించుకతా వొసంగ నదియుం
బట్టూని దైనందినై
ధన సంతానబలంబునం గొనియెఁ ద్వ
త్సర్వస్వ మీచెంతర
మ్మున నిల్లంతయు నాక్రమించుకొనిన
ట్లమ్మా, సరోరత్నమా!

మత్తదంతావళమ్ము లుద్వృత్తి నీదు
విత్తమెల్లఁ గొల్లగొన నోరెత్తలేక
కుత్తు కెండి వచ్చిన పాంథు మొత్తనేల,
ఒత్తుకొను మెట్లపాఁచిఁ గాలత్తఁ గొలన!

తగ్గిరి మునుపటివలె రా
మొగ్గలకును స్నానపానముల కర్థు లయో!
ఎగ్గుసలుపు శైవలమును
దగ్గఱనుంచి కొననేల తామరకొలనా!

ముందువెనుకలు సూడక మొదట నాశ్ర
యం బొసఁగనేల, పిదప శోకంబదేల,
కలువలుం దమ్ములు సరాగఘనపరాగ
పాంసు పూగమ్ముచే నీరు పాడుసేయ?

*    *    *    *

# కూపము

ఇచ్చునది కూప ముండఁగఁ,
బుచ్చుకొనునది ననఁబోఁడి పొంతనెయుండన్,
గుచ్చితపు గిలక నడుమ
న్వచ్చినతన కేమొ, వాయివగులఁగనఱచున్.

గుణము మంచిదైనఁ గోరికఁ దీర్తువు
లేనియెడల నున్నదానిఁ గొనెదు
పతితవితతిఁగావఁ బ్రాలుమాలెదు నీచ
రిత్ర మెంత స్తోత్రపాత్ర మమ్మ!

వాఁడెంత దాతయైనం
బోఁడిమిఁ గీలకముఁజెప్ప బుధుఁడుండవలెన్,
జూడుము చేఁదడుబావియుఁ
ద్రాడే లేకున్న నేమి తా నొనరించున్?

'ఎండటొ వచ్చి నీరము య
థేష్టముగాఁ గొనుచున్ శ్రమంబు నీ
యం దొరకొన్నవారు పవ
లంతయు నీ వెత యెట్లుతప్పు' నం
చుం దలపోయఁబోకుము, వి
శుద్ధజలాంధువ, యెందుఁ దోడుచు

న్నందున నేగదమ్మ, యన
   యంబు జలం బభివృద్ధిఁ బొందుటల్.

సగుణు లుపాంతంబులఁ గొ
ల్వఁగ దర్శనమిచ్చి వినతులకు జీవన మిం
పుగ సత్పాత్రుల కొసఁగుం;
దగదే యసదైనఁ గూపతతి వర్ణింపన్!

జలధరముల్ దయంగనుట
   సంతతముం బ్రవహించు నిమ్నగా
కులజలపూర్తి సంద్ర మది
   గొప్పనుగాంచుట యేమివింత? య
ర్థులకయి పొట్టఁ గొట్టుకొని
   రూఢిమహత్త్వము స్వల్పరూపమే
యొలసెఁ; బరోపకార పరు
   లొందరె యున్నతి నెన్నఁడేనియున్!

బహుగుణానుగమ్య మహహా నీజీవన!
మైన నేమి? కూపమా, వివేక
ముగ నొసర్తు దానమును బాత్రముకొలంది;
నోర్చి యెన్నఁ డిట్లు నేర్చినావొ?

* * * *

# సముద్రము

పవళుల్ రేలు తదేకదీక్షమెయి సం
    పాదించి స్రోతస్వినీ
వివిధాస్యంబులనుండి యయ్యమృత మ
    బ్ధీ, యేమిభోగించితో ?
లవణాసహ్యము, బాడబానలకరా
    ళజ్వాల దగ్ధం, బధో
భువన చ్ఛిద్ర వివర్తనంబు, నిరతం
    బుఁ సల్పుటల్ గాకయో !

జడసంయుతుఁడవు, మలినాం
గుఁడ, వౌర్వానల విదీర్ణగురు విభవుఁడ వో
కడలీ, మైనఁ ధన్యా
త్ముఁడవైతివి విష్ణుహృదయమునఁ దాల్చుటచే.

నిండిన సంద్రమా, పలుక
    నేరను; వజ్రిభయంబుచేత నీ
యండను జేరి డాఁగె హృద
    యంబున కొక్కలమీఁదియాస; న
ట్లుండియు "నున్న కర్మమొక
    యూరికిఁ బోయినఁ దప్ప" దన్నటుల్

కొండలతేని పట్టి కల
  గుండువడుంగద బాడబాగ్ని చే.

కొన్నిమణులు మాత్రము దల
నున్నంతనె గజము గర్వమొందెడిఁ గడలీ,
ఎన్నియొ రత్నమ్ముల న
త్యున్నతిఁగన్న న్మదంబు నొందవు లవమున్ .

సుర లమృతంబు, లక్ష్మి మధు
  సూదనుఁడున్, రశనన్ ధరిత్రి, శం
కరుఁడు సుధాంశురేఖ, నవ
  కల్పకుజంబుల నింద్రుఁడున్, గ్రహిం
చిరి కలశాబ్ధి, నీయుదర
  సీమనగంబుల డాఁచి; తైననే
మగరె! ఘటోద్భవాపదకు
  నడ్డమురాఁ డొకఁడేఁ గృతజ్ఞుఁడై.

నీపగడములకును స్వస్తి; నీమణులకు
జోత; నీమౌక్తికములకు శుభము; కడలి,
ఘోరజలచరంబులబారిఁ గూలఁబడక
ప్రాణముల బయటఁబడితి నంతెచాలు.

శిలలెల్ల న్మణు, లంబుసంచరుఁడు రా
  జీవాత్ముఁ, డాసైకత

స్థలి ముక్తాన్విత, లక్ష్మి వార్వనిత, త
    చ్ఛైవాలపట్టికల్ ప్రవా
ళలతల్, నీరము పాల్, సురద్రువులు కూ
    లంబందు, రత్నాకరం
బు లసన్నామము; ఐననేమి? దగనే
    పోఁగొట్టలే వంబుధీ!

చను దేరఁ భవదీయదర్శనసము
        త్సాహాతిరేకంబునఁ
మినుముట్టంగను ఘోషపెట్టెదవు; నె
        మ్మిఁ స్నానముంజేయ ని
ల్చినఁ బోనెట్టెద; వాచమించు నెడ న
        [illegible]బంబు వాఁగొట్టెదో
వనరాశీ, "యిదియేమికర్మ" మతిథి
        వ్రాతార్చల న్నేరవో?

అమలిన గోమణీకుజము
లౌ ఠార! యొకండననేల? యుత్తమో
త్తమ బహురూపవస్తుతతి
    దాఁచియె గర్భగృహంబునఁ, విరా

గము గలవానిపోల్కిఁ బాడ
  కట్టెదు పై, కెవఁడేమి యిచ్చినన్
నిముసములో వెలింబడఁగ
  నెట్టుచుఁ దుంగతరంగ బాహులన్.

ఉన్నతాధమపదముల నొక్కతీరు
గాఁ గనెడి సర్వసమురీతిఁ గన్పడెదవు
పైకి; గాని నీ లోగుట్టు బయటఁ బడదె
యంబ్వవతరణ సమయమందైనఁ గడలి!

దంతురితస్థలములను బ
రంతప నక్రాదులన్ ధరాధరముల నీ
పొంతనె డాఁచి యెఱుఁగన
ట్లెంత గభీరాశయుండ వెనఁగదు కడలీ!

అడిగిరి నోరువిప్పి విబు
  ధాగ్రణులెల్ల సుధారసంబుదా
రుఁడవయి యిచ్చిపంపుట యు
  ఱున్; మఱియీయవా: యూరకుంటవొ
ప్పెడునది కాని యిట్టు లతి
  భీకర దుర్భర కాలకూటముం
జెడుగఁడ, పెట్టిచంపుదటె
  జీవన మెంతగ నీకుఁగల్గినన్!

త్రిదశులకోర్కెఁదీర్ప వెను
దీసి యెటో గినుమాడఁబూని నీ
వది యిది యిచ్చి, పంపుటకు
యత్నము సేసితి, కాని వారలుఁ
వదలక యెంత వేఁడినను
బ్రక్కలు బ్రద్దలు సేసి రాలఁ దీ
యఁదనపు టాసుధం గొనిరి,
యంబుధి, "లోభికి మూటనష్టి" గా

*　　*　　*　　*

# హంస

ఉరుగాంభీర్యమువోయె, హంససఖుఁడా,
వ్యూహంబుగా నొడ్డునం
బరివేష్టించిరి జాలరుల్, కొలఁకునా
వాసంబు సాలించి స
త్వర మిందుండక పొమ్ము, లెమ్ము, బకముల్
పంకానులేపావలే
పరసస్ఫూర్తిని గూయుచుం బదములం
బై మోఁపకున్నంతలోఁ.

పాలును నీరు వేఱుపఱ
పంగల; వుష్కరవీధి దవ్వులం
గాలు గదల్పఁబోక యరు
గంగల; వున్నతమౌ పదంబులం
జాలగడించె మీకొలము
సామి; యదేమటు తమ్మికాఁడపై
బ్రాలెద; వెంతయున్నఁ గుల
పద్ధతి మాఱదా, రాజహంసమా!

ఐనం దానొకరాజహంస యగుఁగా,
కాకాశగంగా సువ

క్ష్మానూనాంబుజనాళఖాది యగుఁగా
కారాధ్య మేధావియుం
గాని, మైన సమస్తభూతగణహ్యా
తౌత్కూహలాపాది యా
పానీయం బిడు నాఘనుం గన సహిం
పం, దేమి సౌజన్యమో ?

కమ్మని నీటివెల్లువ ద
గం దొలఁగించి మృణాళనాళదా
నమ్మున నాఁకలిం గెడపి
నవ్యజలేజములన్ శ్రమమ్ము వోఁ
జిమ్మి, బహూపకారములు
సేయుఁగదమ్మ సరోవరమ్ము దా
నెమ్మెయి వృద్ధిఁ బొందుట స
హింప వదేమొకో, రాజహంసమా !

ఎవ్వరుమీరు ? హంసముల;
మెందు నివాసము ? మిన్నువాక; సం
దెవ్విధిఁ గర్వులేదు గద ?
యీశ్వరుసత్కృప; పంటలెవ్వియోం ?

మవ్వపుఁ బైఁడితామరలు
  మాకు సమృద్ధము; నత్తగుల్లలో?
యవ్వియెఱుంగ; మన్న నహా
  హా! యని గొల్లునవ్వెఁ గొంగలున్.

'ఏమేహంసల' మంచు నబ్బకము లిం
  దేతెంచి వ్రాక్రుచ్చె; మా
యీమూఢుల్ నిజమంచు నమ్మి; రిఁక మీ
  రేతేర "వచ్చెం బక
స్తోమం" బందురు; తారతమ్యములని
  చ్చోఁ జూడ రోహంసలా
రా, మీస్వేచ్ఛగ నొండుచోటి కరుగుం
  డా, యీసమేషంబునన్.

స్వాకులాయంబుల వీడకుండు బలిపు
  ష్టస్వాంగముల్ గొన్ని ప
క్షి కులంబుల్ కుపితోగ్రకౌశికనఖా
  క్షీణాహతిం బక్షముల్
శకలంబౌటకు సిద్ధమైనను మృణా
  ళగ్రాస వర్ధిష్ణువుల్
శకునుల్ గొన్ని త్యజించుఁ గర్దమము లే
  శంబైన గంగాంబువున్.

వెళ్లఁగఁబుచ్చెఁ బ్రాయమును
    వేడ్కఁ బ్రఫుల్ల సరోరుహాటవీ
వేల్లిత గంధబంధుర ప
    విత్రవిశుద్ధ మనస్సరస్సునం
దొల్లిమరాళ ; మిప్పు డతి
    దుర్భర నిస్వనభేక భీకరో
ద్వల్లవ పల్వలాంబులఁ గ
    టా ! యెటుకాలము వెళ్లఁబుచ్చునో ?

*     *     *     *

# చక్రవాకము

నెమకెంగాని సరోజగేహములఁ బెం
టిం జూడఁగాలేక కో
కము రక్తోత్పల వహ్నిఁ జొచ్చెఁ దొఱఁగం
గాయంబు, వెన్వెంటనే
ప్రమదం బొప్పఁగ గాంచె మున్బడిన భా
ర్యన్ విప్రయోగా సహి
ష్ణు మతిన్, బుణ్యులకున్ ఘటించు విధి య
న్యోన్యానురాగర్ధులన్.

కనినీటం దన నీడనే యొకవియో
గ క్లిన్న కోకంబు భా
ర్యనుగా నెంచి బిసాంకురంబు నిచె నా
స్యంబందు; వారిప్లుతం
బును దత్కాండము సూచి కాంతయిడెఁ గాఁ
బోలంచుఁ దాఁ బ్రీతి మె
క్కెను, మూఢుల్ పరమార్థమందున సుఖుల్;
క్లేశాతిరేకుల్ పరుల్.

ఏడువకు చక్రవాకి, నీ కెల్లకాల
మీవ్యథయ నిల్వదు; సుఖంబు నెనయఁగలవు;

పోదాచీఁకటి? వెన్నెల రాదో? ప్రొద్దు
గ్రుంకదో? తెల్లవాఱదో యింకమీఁద?

చాలం జింతిలె ఝంకృతిన్మధుప వం
శంబుల్, తరంగాళి వ్యా
లోలంబయ్యె, నిమీలితంబు నళినీ
లోకంబు, వ్యత్త్వాటితా
స్యాళుల్ కైరవముల్, నిశిన్ విరహి చ
క్రాంగ వ్యథం జూచుటన్
హా! లోకంబున సాధు లోర్వఁ గలరే
యన్యోన్యమన్యూద్ధతిన్?

*　　*　　*　　*

# తుమ్మెద

కమలిని జూడలేదు కడ
గంటను; గుంజకు మ్రోఁతచేతఁ దో
షము గొలుపంగలేదు; విర
జాజులతేనెఁ గదల్పలేదు; వే
గమ నవమాలతిం దఱిసి
కౌఁగిటఁ జేర్పఁగలేదు; కాని యీ
క్రమముల నన్నిటం దనిపె
రాత్రి మధువ్రత మాలవంగికన్.

ఆఁగుము, పోకుపోకు పయి,
కంతటిసాహసమేమి? తమ్మి నీ
భాగమునందుఁ జేరినదొ?
స్వార్జితమో? మఱి యిల్లటంపు సొ
మ్మో? గృహిణీ సమార్జితమొ?
పోకిరితుమ్మెద త్రిమ్మరీఁడ, యీ
లాగునఁ దోడితుమ్మెద న
లంచిపెనంగెదు చాలుఁ బొమ్మికన్.

"ఎచ్చట నంటఁగందునో? మ
ఱెచ్చటఁ బైకొన నెంతగా మది

నొచ్చునో? తాను నొచ్చినఁగ
నుంగవ రాలును నాకు బాష్పముల్
వచ్చిన దట్టి మైత్రి” యని
పల్వగలం గలువం గరంచి నీ
యిచ్చయుఁదీరఁ బోమెదు య
థేష్టముగా నదియేమి తుమ్మెదా!

జాతులఁ గంటఁ గన్గొనక,
సంపెఁగమొగ్గల నిగ్గు సూచి సం
ప్రీతిని జెట్టపట్టక, ప
రీమళము న్వెదచల్లు మల్లికా
రీతుల మోదమందక, వ
రింపక పద్మినిన్, మధువ్రత
వ్రాతము కేసరిన్నమకు
వంకల నంకిలి ఝుంకృతి ధ్వనిన్.

* * * *

# పద్మము

ఫలముల మాధురీగుణము;
        పత్రములం జిగిసొంపు; కేసరం
బులను బసిండి నిగ్గులును,
        బువ్వులసౌరభ, మెల్లచోఁదళ
త్తళలును గల్గియుంటివి; ము
        దంబె సరోజమ, కాని నాళమం
దలమె మహోగ్రకంటకము
        లందుసఁ బాత్రమవైతి నిందకున్.

సాటిగానివారి సాటియగుటకంటె
సిరులఁబాసియునికి కరము మేలు
కుముదవిభవతౌల్య మమరునం చనికదా
తమ్మిరేలఁ జక్కఁదనముఁ బాయు.

సారెకు సారెకుందిరుగు
        సర్వవిదుండునుబోలెఁ జెంగటం
జేరియొనర్చుగోలఁ, దన
        స్నేహితులంబయిపైకిఁ బంపు, దు
ర్వారమదంబునొందు, మక
        రందముఁ దృప్తిగఁ గ్రోలుచుండు నో

నీరజమా, మధువ్రతము
నిన్ బలుతిప్పలు పెట్టసాగెడిన్.
ద్విజరాజే టయెగాక షోడశకళా
విభ్రాజితుం డిందుఁ డ
క్కజమయ్యెన్ మొగమేల త్రిప్ప? సలుపం
గారాదె యాతిథ్య మం
బుజినీ, రే దొర నీసడింప నగునే?—
పో కైరవిణ్యాస్యమున్
భజియించెన్ "దెగుదాఁక నేటికి బిగిం
పన్" లేరటే నీసముల్?

తమదారిఁ దాముచనుచు
న్న, మనుష్యులఁ బిల్వనేల? నలినీ, దళమం
దమరిన జలబిందుల ము
త్యములంచును జూపనేల? తన్నూ లవేలా?

ఒక్కచోఁ బుట్టిపెరిఁగితి, రొక్కచోటఁ
గళలనేర్చితి, కొకచోటఁ గ్రాలుచుంటి,
రైన రాజ్ఞినీయప్ప సహస్రదళము
లకును; నీవో శతదళమ్ములకెగదమ్మ?

జీవనవంతురాలయి వి
శేషముదంబుల నాళభద్రపీ
ఠావసథాధిరూఢయయి
నన్నిదినాలఁ గరోపగూహన
ప్లావితఁజేసి, నేఁడొకనె
పంబున స్థానము వీడెనంచు నా
నావిధబాధలం గలఁచి
నాఁడినుఁడబ్జదళంబు నద్దిరా!

నిరతము నిద్రలేచి ద్విజ
నిర్మల మంగళగీతికాపరం
పర, హరిసేవలన్ సలిపి
వల్లభు పాదములంటి మ్రొక్కి బం
భరముఖయాచకాళి కతి
మంజులమార్దవ మాధురీమరం
దరసము చూఱనిచ్చెదవు;
ధన్యవుపో, బిసినీప్రసూనమా!

జీవనమింత కల్గి పరి
శీలనసేయఁ గళల్ ఘటిల్లి ల
క్ష్మీవతివై విరాజిలుచుఁ
జెంతకుఁ జేరిన యాచకాళి కాం

తూవిధిఁ దీర్పకున్నఁ ద్రిజ
        గంబులఁ సీయపక్త్రివల్లికల్
మోవులు సాఁగకుండునటె
        ఫుల్లమనోజ్ఞ బిసప్రసూనమా!

ఏకరముల నాశ్లేషసుఖైకమగ్న
సలిపె నాకరములనే ప్రచండకిరణుఁ
డిప్పుడు స్థలాంతరమున నిన్నేఁపఁదొడఁగె
వరుల కెగ్గుసిగ్గులు లేవు వారిజంబ!

జంఘాలుం డినుఁ డెల్లరేలును ప్రవా
        సంబందె వర్తించి మా
సంఘుంబుం గికురించెఁ జుమ్మని యమ
        ర్షాయుక్తి నిందోక్తులన్
సంఘర్షింప, వలంక్రియల్ గొనవు; భా
        స్వత్సత్సతీధర్మ ము
ల్లంఘింపందొరఁకోవు; పద్మిని, భవ
        చ్చారిత్ర మొప్పుంగదే!

కుముదిని మెన్ని యోగతులఁ
        గూడివిభున్ గళలీనుచుండ, ని
త్యము నిదియేమి కర్మము: మ
        హా విరహంబున రేలవేఁగె దో

కమలిని, ‘దేశద్రిమ్మరి’ని
గాంతునినమ్మి యొసంగ, నిట్టి క
ష్టములను బొందలే వీఁక “వి
డాకు” గ్రహింపుము స్వేచ్ఛఁగల్గెడిన్.
కాంతుని యింగితాకారమ్ములం దెలి
యఁగలేక గడగడలాడు సారు
“నీకంటె నాప్తులు నాకొరు లేరు లే”
రని తదేకత నాథు సరయు తీరు
తలఁపులసిగ్గుదొంతర లఱవిప్పఁగన్
తెప్పలాఁగ మొగంబుఁగప్పు సొబగు
పొలకువనట్టి సముచితవిధుల్ దీర్చు
చడఁగి మడఁగియుండు నాహొరంగు

నా పరస్పరవిశ్వాస, మా పరహిత
భావ, మామిథునైకతాబద్ధసౌఖ్య,
మొకపతివ్రతాధర్మమందె కలదమ్మ
పద్మినీ, “విడాకుం” గొన్నఁ బడయలేవు.

సంపెగ సొంపునింపక వి
శాలతఁ జూడక గేదఁగిన్, నిగా
సంపుహొయల్ గులాబిఁ గని
రంజిల, కవ్వాలపాని మల్లె లా

లింపక మావితీపికిఁ జ
లింపక, కల్వామృదుత్వ మొప్పకా
సంపదచేడె శీలము పొ
సంగుటఁగా నినుఁజేరెఁ బద్మినీ!

నీట నటియించు నీకును నింగిఁదిరుగు
రవికి నేరీతిఁ బ్రణయాంకురమ్ములాదవె?
అంతరం బెన్నియామడ లంబుజంబ?
దవ్వుదాపులు ప్రేమకు నివ్వటిలవో?
సమయానుకూలముగఁ గా
లముగడపెద వారుల బాధలంబెట్టక నై
చ్యమునకు నీవొగ్గక నీ
రముకొలఁది చెలంగుచున్ సరఃప్రభవంబా!

* * * *

# సంపెంగ

చంపకమా, వనీపకులు
సల్పిన చేఁతలచేత వారిఁ గో
పింపకుమా, కడుంబడలి
తేనియు నీ కెవరమ్మసాటి ?—నె
య్యాంపునుడుల్ గ్రహింపవా ? యు
నన్యసువర్ణ సుసౌరభంబుల
న్నింపిన ధాతపైఁ గినియు
నిన్ సృజియించినవాఁడు గావునన్.

రమణీయంబగు సుందరత్వము, నన
ర్ఘ్యంబైన సౌరభ్యబం
ధము, లోకోత్సవదాయి పూజ్యగుణమున్
నాకుండెఁ జుమ్మంచు గ
ర్వమునుం జెందకు మెంతకాలమె యిటుల్
భాసిల్లుటల్ ? వృద్ధ భా
వమునుం జెందవో ? వృంతము న్విడువవో ?
వాతాహతిం గూలవో ?

పువ్వులు నొవ్వకుండ రస
ముంగొను నేరుపు నభ్యసించెఁ, దా

నెవ్వారికే నలభ్య మగు
హృద్యమధుస్వరమాలపించుఁ, గ్రొం
బువ్వులఁగాని చేర దలి
పోతము, దుర్గుణమేమి చూచి నీ
వవ్వాలి మోము సేసెద వ
యారె! రసజ్ఞత లేదొ సంపెఁగా!

అన్ని కుజంబులవలె నీ
వున్నావని పాడుఁగూడ నొనరింపని నా
కు న్నవ్య కుసుమగంధ
ప్రోన్నతి సిగ్గు గలిగించి తో సంపెంగా!

ఎంత సువర్ణము గల ధన
వంతుఁడవైన నిదియేమిపని? పాపము పో
ర్లింతలు పెట్టెడిమధుకర
సంతతి కన్నుఁగవ దుమ్ముఁజల్లఁగ నీవుః.

అరసిచూడఁ జిత్తమన
యంబును గర్కశమే; సుసౌరభో
దారత మెప్పులే, దొరలఁ
దారసిలుం దను సంగ్రహించినః
ఘోరతరాఘ; మిట్టి దగు
కూళను హేమమెటింగికూడ నా

పేరులనే యదేమిటికొ
పెట్టిరి నీకు నరుల్ సువర్ణమా!
నీ పరిమళంబు నదేమి దాఁపటికమొ?
ఆహారించి మరుత్సఖ్యతో హారుండు
విందువెట్టు స్వబంధుల కందఱకును
దవ్వునున్న వారికి ఘ్రాణతర్పణముగ.

కలదు 'డాబుసరిగ' నీకుఁ గాంచనాఖ్య
కూటికా? గుడ్డకా? యెందుకు? ఫలరహిత;
మింతయొకరికిఁ బెట్టఁ దానింత తినఁగ
లేని సిరియేల? కొల్చుట కేనితగునె?

ఎందు నీకు ముఖప్రీతియందు నాస
మెందు, కాకున్న నొయ్యారి మెలఁత మొగము
కనులఁ బడఁగనె నిలువెల్ల ననుచు టేల?
సంపెఁగా, యింతలో నెంతజాణవైతి!

తల దాఁచుకొని నెలంతల
తలఁ దలఁగిననేమి నీవు, తలకొని నీచెం
తలఁ దారువింటి కుఱ్ఱఁడె
తల గామై తెల్పె నీకతల గంధఫలీ!

*　　*　　*　　*

# గేదంగి

ఒక గంగాధరుఁ డాదరింపక-యున

హ్యుండ~~మ్యోనన్ జూచి యుం~~

చకటా వందురనేల? లేరె సుగుణ

వ్యాలీఢు లీధాత్రిఁ? గే

తకి, సామంతనృపాల మౌళిగతర

త్నాఢ్యోత్తమాంగంబులం

బ్రకటోత్సాహకులై ధరింతురు మహా

రాజాధి రాజుల్ నిన్నుఁ.

కొన్ని మొగ్గలు, నరవిచ్చి కొన్ని, కొన్ని

పూర్తిగావిచ్చి, పరిమళంబు వెదచల్లుఁ

గాని యెప్పుడ్వగూడ నీకరణి వాడి

నపుడు నామోద మీయలేవమ్మ మొగలి!

ఏరికంటఁ బడక కాలమెల్లా వెడలఁ

గడపు నీకడవింగూడఁ గంటకాళి

పై కొనియెను; మిన్నాగుల బాము హెచ్చెఁ

దప్పునటె పూర్వకృతము గేదంగిరేక!

* * * *

# రత్నము

మహితమ్మంచు మహార్ఘమంచు రతన
 మ్మా, నిన్ను నిర్వ్యాజతన్
బహుమానింపఁడ యేని మందమతి యె
 వ్వాఁడైనఁ బోనిమ్ములే
మహిలో నింక గుణజ్ఞులుండరె యసా
 మాన్యుల్, పరీక్షాధురా
వహులేమీ ధర గొడ్డువోయినదె? లే
 వా యేమి నీశాస్త్రముల్?

బొబ్బమొకంబు కాలికొన
 పోటుల నేనుఁగు నెత్తినుండి త
బ్బిబ్బయి నల్గెలంకుల బు
 వింబడి 'యక్కట! కాలితాఁపు లి
ట్లబ్బెఁగదా' యటంచు వగ
 నందకుఁడీ, మణులార, తేండ్లు మి
మ్ముబ్బుచు గౌరవించి విభ
 వోజ్జ్వలులై శిరసావహింపరే!
"వనియందుంగపి మూర్కొనెన్, మురిపె మొ
 ప్పంబూని చుంబించె, నా

ల్కను నాకెం బలుమారు, నోట నమలెం
గన్పింపమిఁ దీపి యొ
య్యాన నన్వీడె” నటంచు వందురకు మ
మ్మా రత్నమా, లోచవిం
గోన జాలఁ జిద్రుపల్ వోనర్పమియె నీ
కుంజుమ్ము కళ్యాణముల్.

వింతయగుఁ భవచ్చరిత
విన్న కొలందిని రత్నమా, విభా
స్వాంతుని యంతవాఁడె నిక
పవ్యథచేఁ బదిరెండు వ్రక్కలై
కాంతి దొఱంగ, నీవు దృఢ
కాయుఁడ వౌటయెగాక మందిర
ధ్వాంతముఁ జోపె దుజ్జ్వల వి
భావిభవ ప్రథితప్రభావతఁ.

* * * *

# బంగారము

సారతర ప్రభాపటలి
జాల్కొన, రమ్యసురూప మేర్పడం
గీరితియు న్మహార్ఘతయుఁ
గీల్కొన, రత్నముతో సమానమౌ
గౌరవ మబ్బ, సర్వసుభ
గత్వములున్ ధర నీకుఁ గల్గ బం
గారమ, కారణం బరయఁ
గా శుచిసంగతి నంచుఁ దోఁచెడిన్.

వెగ్గలమైన యగ్గినిడి
వేదనపా లొనరింత్రుగాక, తా
రగ్గ మొనర్త్రు గాక నిక
పాయత దుర్భర భూరిధారకున్
నుగ్గగుఁగాక నా తనువు
న్యూనతమై దురపిల్లనంచు హా
న్న గ్గురిగింజతోడఁ దుల
యాటకుమాత్రము బిట్టు బెగ్గిలున్.

సర్వగుణముల సర్వజ్ఞ సదృశుఁడైన
నొక్కఁడు నిరాశ్రయుఁడు వన్నెకెక్కలేఁడు;

నిజము : వెలలేని మేలుమానికముగూడ
యుష్మదాశ్రయ మాసించుచుండుఁ బైఁడి!
కలిగెను నీ కగ్నిపరీ
క్ష; లవంబును జంకవోకు; కాకరుఁ దగువ
న్నెల నెనయఁగలవు "కష్టే
ఫలీ" యనఁగ వినవఁటమ్మ, బంగారమ్మా!

క్రొత్తఁదన మెంతయున్నఁ, ద
ళత్తళమను వన్నె యెంత లలితంబైనన్,
బుత్తడి, మెత్తటి నేనిన్
సుత్తియపెట్టు గనకున్న సొమ్మయ్యెదవే?

ఇతరలోహాలకన్న నీవెట్లుపెద్ద?
వేల నీకింత గౌరవ? మెల్లవియును
నీవలెఁ బ్రయోజనకరముల్ గావె, పైఁడి,
అతిపరిచితిలేమినో నీకు నబ్బె ఘనత?

* * * *

# సింగము

"ఒక్కఁడ నసహాయుండం
జిక్కితి నపరిచ్ఛదుండఁ జిక్కులు నా కిం
కెక్కరణిఁ దప్పు?" ననువగఁ
జిక్కవు కలలోన నైన సింగపుఱేఁడా!

ఇలః ద్రవ్వం గిరి; యిఱ్ఱి యీడుఁ, బులి గ
ర్జించుఁ గదుఁ; నక్క బొ
ర్రలు వెట్టుం; బరువెత్తెదుఁ రురుచయం
బుల్ వేగఁ; గుండేళ్లు గం
తులు సాగించు; గజంబులుం దరులతా
స్తోమంబులం ద్రుంచెదుఁ;
భళిరే! సింహామ, నీవు లేనియెడ నీ
పాటొందెఁ గాంతారముఁ.

హృదయభేదక ఘీంకార మదగజంబు
నొక్క త్రుటిలోన లీలగా నుక్కడంచు
నీవు నొకబక్కనక్కపై నేలఁ గినియ?
గాలి కెగయు నీసటలకే సోలు నదియు.

కొట్టెదవా మదద్విరద
కుంభము వ్రయ్యలువాఱు; బొబ్బలం

బెట్టెదవా మృగాంగనల
బృందము లీచుకపోవు; గంతులం
బెట్టెదవా ప్రభాకరుని
పీతులు చేతలు దక్కు; నట్టినీ
వెట్టుల నక్కియుండెదో మృ
గేంద్రమ, తచ్ఛరభారవంబులన్?
"పుట్టుకతోడ శౌర్యమునఁ
బొల్చిన నే నొకవేళ నాఁకటం
బుట్టెడు మంట వేఁటకయి
పోవఁగఁ జేగల యామెకంబు గ
న్పట్టుడుఁ జేయి చూపెదను
స్వల్పమృగంబుల నంట" నంచు బల్
పట్టుగ దీక్షఁబూనిన ను
పాసము నందెద, వేరి కేమగున్?

సింగంపుంగొదమల గీ
ముంగన్నుం ద్విరదకుంభముక్తాతతు లుం
డుం; గుంటనక్క నెలవం
దుం గొఱలుం దూడ తోళ్లు దోకల్ గొరిజల్.

*  *  *  *

# కోఁతి

ఓరీప్లవంగ, సరసపు
నారికెడము వలదు వలదు నగి నిందింపన్,
నీరదన నఖరముల గత
సారములం దిట్టు మింకఁ జాలితి వేన్రిన్.

కలుగుంగాక బలంబు కానన ఫల
    గ్రాసంబుచే, నెక్కుఁగా
కలవింగొండల శృంగముల్, కదలుఁగా
    కట్టెట్టులం జెట్లు గం
తులఁ, బర్వెత్తునుగాక వేగమునఁ, బూ
    నుంగాక వాలంబుఁ, గోఁ
తులు సేత్వర్థము వైచునే జలధియం
    దుం గొండలం గుండులన్?

ఏరయినం బ్లవంగసభ
    కేగినచో మృదులాసనంబులు
ర్వీరుహశాఖలుం, గుశల
    పృచ్ఛలు దుస్సహదీర్ఘ ఛీత్కృతుల్,
క్రూరనఖాగ్రదంతముల
    గ్రుచ్చుట చీల్చుట లాతిథేయముల్,

చేరవఁటయ్యా జాత్యుచిత
చేష్టలు సర్వము స్వీయసంతతిన్.
తాల్మి మోసెదు పంటిమోయఁ; బసులన్
రక్షింపఁగా మూఁపునం
గోలం బూనెదు; పల్లెటీల్ముదమునం
గొట్టంగ నుంకింతు; ముం
గాలం జూచెదు వేలఁజూడఁ బ్లవగా,
కర్త్రాజ్ఞమై పెక్కుచం
దాలం; గాని స్వతంత్ర శక్తి గనుఁగొ
న్నన్ లేదు నీ కింతయున్.

* * * *

# మార్జాలము

చిలుకవలెఁ గులుకుటులివ్వం
జిలికింతో? పరాక్రమింతో చిఱుపులినా? ధీ
బలము గలదో నక్కలకుం
బలె? నీవృత్తిఁగన సిగ్గువాటిలెఁ బిల్లీ!

పంజరమ్మునఁబడి పంచలపాలైన
జిలుఁగు టెలుఁగుఁ జిలుకఁగలయఁ జూచి
గుఱ్ఱువెట్ట దేలోకో, పిల్లి,—కర్కశ
దశన కుర్కురములఁ దార్కొనెదవే?

తమి జానుద్వయిఁగూరుచుండి, నఖసం
తానంబుల న్జాఁచి, వ
తుము విప్పాఱఁగఁ జేసి పొట్టిగ నథః
కాయంబుఁ గుంచించి, వా
లము జాడించుచుఁ బిల్లి, యొండ్లపయి కు
ల్లంఘింతు వేమంతమా
త్రమునన్? "మ్యా" వనునప్పుడైన మది వ్యా
ఘ్రభ్రాంతి న న్వీడదే?

వలదు వలదు గర్వము సముజ్జ్వలమణి ప్ర
భాలసన్నృపాంతః పురావాసి ననుచు,
నమరు రాజ్యాభిషేకకాలమున మండ
నం, బహోప్పిల్లి, వెలుపలి నాగమునకె!

*　　*　　*　　*

# కాకము

అలమధుమాధవుల్ సనిన
        యంతనె కొండలఁ గాల్వల న్వనం
బుల నెటనో ప్రవాళసుమ
        ముల్ వసియించెను; సేదదీర్చుకో
మలయ సమీరుఁడు న్నిలిచె;
        మౌనముదాల్చెఁ బికంబు; లిప్పుడే
కలిగెను నీకుఁ గాలమిఁకఁ
        గాకమ, బందులతోడఁ బాడుమా.

ఱెక్కలు సాఁచి కొట్టుచును
        జివ్వున గేహవనాగ్రశాఖపై
నెక్కి స్వయూథముం బిలిచి
        యే బలినేఁ దిననేర్తుగాని, హా!
ఱెక్క గదల్ప కాకసపు
        రేవున హాయిగ నంచలాడు; నా
ప్రక్కకు నేనిఁ జూడఁ గల
        వా భయమొందక చీకుఁగాకిగా!

కోకిల పాటఁ బాడు నెడఁ
        గొండొక చెంగటి కొమ్మపై మెయిం

గాకము వాల్చి పాట విను
  బైకవడి పీనుల దోరగించు; న
ప్రాక రసంబు గ్రోలి ముద
  మందు నటుల్ దలయూఁపు; బ్రాఁగను
న్నేకొనుఁ దన్మయత్వమును
  జెందినటుల్; రసికత్వ మబ్బెనో!

నల్లనిరూపు దాల్చినను,
  నవ్యఫలంబుల నారగించినన్,
జల్లని మావితోఁటలను
  సంతసమందుచు సంచరించినన్,
ఎల్లెడఁ బైకవృత్తి వహి
  యించినఁ, గాకమ, నీకు నబ్బఁగా
నొల్లవు సర్వమోహన సు
  ధోజ్జ్వల మంజుల కాకలీకలల్.

ఆగతానాగతముల శుభాశుభములఁ
దెలుపు నీకూఁత శాకునికులకు దూత:
బలికి నీరాక సత్కార్మములకుఁ డీక
కూడనిద యన్నిటికిదూబ గ్రుడ్లగూబ.

* * * *

# చంద్రహాసము

చాలుఁ దమిస్రసమా, ప్రబల
సాహస : మింకిట నాల్గుజాలునుం
జాలుగ నాడవచ్చు నని
సంతసమందెద వాత్మఁ; బచ్చగు
ఱ్ఱాలవజీరుఁ డస్తకుధ
రంబున నుండిననేమి? వీఁడె నీ
పాలిటికాలుఁ డిందుఁడు ప్ర
భామయుఁ డభ్యుదయంబు సెందెడిన్.

దినమణి పశ్చిమంపు జల
ధింబడి పోవఁగ రేయి క్షీణచం
ద్రునిగనెఁ దారకల్ చెలఁగెఁ
దోరపు ముత్తెములట్లు, దీపికల్
స్వనికట వస్తువర్ణముల
సంజ్ఞనె తెల్పఁగలేవు, స్వేచ్ఛవో
యిన వికల ప్రసారలయి
దృక్కులు గంతులువేయఁ జొచ్చెడిన్.

అకటా సూరి త్రిలోకబంధుఁడు ప్రతీ
చ్యబ్ధిం బడెన్, రేయిరా

కకు నాసించెడి మూఢమూకతతి కౌఁ
గా కవ్యయానందముల్ ;
సుకలాగ్రీయుఁడు సత్ప్రియుండయిన యా
శుభ్రాంశుఁడుంగూడ నెం
దుకు పీడఁ వలయుం దుషారమిష సం
తోషాశ్రు సంతానముఁ?

కడల న్వెన్నెలవెల్లువల్ వఱపి దు
గ్ధాంభోధినిండించి, ప్రే
ముడి నిందీవరకైరవంబులకు నా
మోదంబు గల్గించి ; తీ
నడతల్ మంచివె, కానిపద్మవిభవో
న్నత్యంబు మాయించె దె
వ్వఁడు దోషోదయ మిక్కతంబునఁ గదా
పొల్పారె నీ కిందుఁడా!

నిన్నొగిఁ గంట నద్దికొనెఁ
నీరజనాభుఁడు ; శూలినెత్తిమీఁ
ద న్నెనరూని పెట్టుకొనెఁ;
దన్నుల కాదిమదైవతంబ వీ
విన్ని విధాల నున్నతి వ
హించియు నొక్క మృగీప్రియత్వముం

గ్రన్ననవీడలే కకట!
    కంటి మృగాంక, కళంకి యున్నడిక్.

ఇందుఁడు ముజ్జగంబుల క
    ధీశ్వరుఁడౌ శివు నౌఁ దల న్మహా
నందము నొందుఁగాయని జ
    నంబు మదిందలపోయుచుండు; న
క్తందివ ముజ్జ్వలన్నిటల
    గాఢతమాగ్ని శిఖాచయంబు చే
నందమువాసి చచ్చి సగ
    మాటఁ దలంప దిదేమి చిత్రమో?

*    *    *    *

# అల్పుఁడు

మందబుద్ధుల కమృతనిష్యంది సుకవి
సూక్తులందు వాచాటుల యుక్తులందు
సదృశదృష్టియ; పరభృతస్వనములఁ స్వ
గాలముల బొబ్బల న్మహిమాళికట్లు.

పిచ్చిక మింట గంతులను
బెట్టు సుపర్ణుని మీఱఁగా; ఖలుం
డొచ్చెము వెట్టు కుంభజున
కుప్పని నీటిని ద్రావి; దోమ దా
నచ్చిక పాటవాడి పరి
హాసము సేయును గిన్నరాంగనఁ
వచ్చిన నేదియో సమ గు
ణం, బిఁక నన్యము సూడ రల్పులుఁ.

కనునె దిరస్కృతిం దరణి
కన్నుల నొక్కఁడు మూసికొన్నచోఁ?
దనచెవి నడ్డు కొన్నఁబిక
తండము కాకులమూకయౌనె? మూ
ర్ఖనరుఁడొకండు దాఁ దిరుగఁ
గాఁ దనచుట్టు ధరిత్రి కోటుగ

ల్గునె? పిడికింట నాకసముఁ
గొట్టిన దానికి నొప్పి పుట్టునే?
ఘనవిద్వాంసుఁడె దే నొకప్పుడు తిర
స్కారంబు గావించి స
జ్జనులం, దోసము వాపుకోఁ గలుగుఁ బ
శ్చాత్తప్తచేతస్కుఁడై,
తనదోషం బధిపాపుఁడుం దెలిసి యు
ద్యద్గర్వ దుర్వారుఁడై
యనయంబట్టులె పాపకర్మములఁ జే
యంజూచు స్వేచ్ఛారతిన్.

లజ్జ నొందఁడు సజ్జను లుజ్జగించు
నబ్భుజంగ వక్రక్రియ లాచరించి,
మఱియు నన్యు లెఱుంగని మాడ్కి నలిపి
తనుచుఁ దననేర్పు నగ్గించుకొను ఖలుండు.

ఉన్నతుల ప్రాపు దన కెక్కు డున్న దనుచుఁ
గన్నుమిన్నుగానం డల్పుఁ డెన్నటికిని;
మిన్నొరయు కొండపై నెక్కియున్నమాత్ర
మున నెపరమాణువుమహత్త్వముంబొరయునె?

కరువలిదిండిగా యని జ
గంబులు పాములనమ్మి మోసముం
బొరయు; జలవ్రతంబులను
బుద్ధిని గేకులనమ్మి పాములుం
దొఱఁగును గాయముల్; శిఖులు
ద్రుంగు మృగాజినధారులంచు ఘ
స్మరశబరాళి నమ్మి; ధర
జాల్ములకుండునె దీర్ఘదృష్టులున్?

*    *    *    *

# వి ధి

లెక్కంబెట్టఁ దరంబుగాని వికృతుల్
దీనుల్ దరిద్రుల్ గత
న్యాకారుల్ గలరెందఱో భువి బుభు
క్షాకీర్ణు, లవ్వారికిం
జిక్కంబోని మహాపథుల్ గిరిశిర
శ్శ్రేణిన్, నభోవాటి స
మ్యక్కల్పద్రుమముల్ సృజించితి; విదే
మయ్యా, విధీ, నిర్దయా!

వెనుక దహించుచుండె నట
విన్ జ్వలనుం, డిరువంకలన్ వలల్
దనరె; పురస్థ్సితుం డెఱుకు
దార్కొనె విల్గొని; వేఁటకుక్క లు
గ్రనిరతి వచ్చెడిన్; ముగుద
గర్భభరాలసయాన; కాళులం
బెనగొనుచుండె సంతతి వి
భీతి; మృగం బిఁక నేమిసేసెడిన్?

వలలు దవానలంబుననె
భస్మములయ్యె; శశామిషాశఁ గు

క్కలుసనెః నారిపోయిన ద
కాలపయోదజలంబుచే దవా
నలము; కిశోరముల్ పఱచె
నల్దెసలన్; విఱిగెన్ గిరాతువిల్;
చెలి ప్రసవించె; నౌర! విధి
చేయఁ దలంప నసాధ్యముండునే?

తరలెదఁగాక యున్నతప
దంబున కంచును దూది “దేశద్రి
మ్మరి” బలవంతుఁడైన పవ
మానుని చెల్మి యొనర్చి వాఁడు భూ
ధరశిఖరంబునన్ తృణము
దన్ని, కుటాగ్రము సేర్చి, వైవ సం
కరమున, నంతఁ ద్రోసె విధి
కట్టు! మహోగ్రతరాగ్ని కీలలన్.

*　　*　　*　　*

# మేలిపలుకు

హృదయము సదయము, సత్యా
స్పదము పదము, చరితము గుణభరితము, కా
బదియొరులకు సాయం, బి [యం
ల్లిదిగిన పున్నెములగని నుతింపందగదే?

ప్రతిగిరిపై మాణిక్యము
ప్రతిహస్తిని మౌక్తికంబు, ప్రతికాంతార
క్షితిఁ జందన ద్రుమంబును,
బ్రతిస్థలమునందు సాధువర్యుఁడు గలఁడే?

పురువులఁ బట్టు, రాలజిగి
పుత్తడి కల్మషపంకమందుఁ దా
మర లుదధిన్ సుధాంశుఁ, డహి
మానిక, మింధనమందు వహ్ని, సుం
దరమగు కల్వ గోమయము
నన్, జనియించి స్వసద్గుణంబులం
బొరసె మహత్త్వముల్ "గుణమె
ముఖ్యము; పుట్టువుజోలి యేటికిన్?"

అసమర్థుఁడైన నరుఁడుం
బొసఁగిన సంపదల ముప్పవొందు; నెమిలియ

య్యాసదృశపింఛమున నెఱుకు
విసపు ములికికి గుఱియగుట విందుమ కాదే?

మునుశిశుపాలుఁడు శ్రీకృ
ష్ణుని బ్రువ్వఁగఁ దిట్టి రాజసూయమ్మునఁ బ్రా
ణనికాయము వదలె, నిఁకే
మొనగానికిరాదు బెడఁద బుధులం దెగడన్?

“విను నామాటలు పాండునందనులతో
        వేరంబుసోలింపు, ప
చ్చనివంశంబును బాడుసేయకు, దురా
        శన్ వీడు దుర్యోధనా”
యని పల్కన్ విదురుం, డతండు వినకే
        ప్రాణంబులం గోలుపో
యె; నెవండేని సుహృద్వచోవిధుల గ
        ర్హింపంగ రాదేకదా.

కాంతను స్వీయఁ బుత్రయుతఁ
        గణ్వసుతం బతిభక్తిసువ్రతన్
జెంతకుఁ దన్ను నమ్మికొని
        చేరు శకుంతల నీసడించి దు
ష్యంతుఁడు నిగ్రహించెఁ దద
        నంతరమే పరితాపమంది సు

స్వాంతమువై గ్రహించెఁ దగు
నయ్యా త్వరంపడిసేయుటల్ పనుల్ ?
అన్నను దండకావనము
నం దెటులైనను గోలుపుచ్చి యే
తెన్నునెఱుంగనట్టి నసుఁ
ద్రెక్కొనఁజూచెదురా దురాత్మ, యం-
చు న్నిరసించి యమ్మఱఁది
సుస్తవనీయ చరిత్రు లక్ష్మణున్
బన్నములందె సీత మును
ప్రల్లదపుం బలుకేల యొప్పెదున్ ?
బలితపువేఁట పెందమిని
బొందు నృపాలకుఁ డజ్ఞుఁడై మృగం-
బుల తను వొంది క్రీడమెయిఁ
బొల్చెడు దంపతుల న్మునీంద్రులన్
బొలియఁగఁ జేసి తత్ఫలము
వొందెను, బాపమెఱింగి చేసినన్
దెలియక చేసినం గుడిచి
తీరుదు రేరయిన న్నిజంబుగన్.
అంబుజలోచనావసథ
మందున నోటికొలంది ప్రేలి క

య్యంబున కేగి కౌరవమ
హాబల మల్లన కానుపించినం
బంబిన బీతుచేతఁ బఱ
వం దొడఁగెన్ మన యుత్తరుండు, కా
ర్యంబుల పట్టునం దెఱుఁగ
నయ్యెడుఁ జుమ్ము నిజంబు డంబముల్.

*　　　*　　　*

# ఆధిపత్యము

తన కధికారమున్నపుడె
ధర్మముచేసినఁ, బాపమాచరిం
చిన, సుయశంబుఁ బొందినను,
జెడ్డయశంబును గాంచినన్, మహా
జనుఁడను పేరుఁ జెందినను,
జాల్ముఁడు నా బిరుదంబు గొన్న, నా
వెనుక మఱేమి యబ్బును? ల
భించును నాకమొ, కాలులోకమో?

ఎప్పటి కెట్టి వీలు లభి
యించిన వీసరవోవనీక తా
నప్పటి కప్పుడే సుకృత
మార్జనసేయుట లెస్స, "దీపము
న్నప్పుడె దేవులాడుకొన
నా" నని చెప్పరె పెద్ద, లావలం
జొప్పడు నయ్యొ, నీకుఁ దఱి,
చూచునె నీమొగ మొక్కఁడేనియున్?
'గతి యిఁక మీరె' యంచు 'నప
కారము సేసిన మేలుసేసినన్

మతి యిఁక మిమ్ము వీడ' దని
'మా బ్రదుకంతయు మీదె'యంచు సం
స్తుతు లొనరించు మానవులు
దూరమున న్నగుచుండ్రు నిన్ బద
చ్యుతుఁ గని, యప్డు నీకు సుకృ
తోదయ మొక్కఁడె సుమ్ము దిక్కగున్.

"అదిరా! కన్నును మిన్ను గన్పడక యు
గ్రానేక దుష్కార్యముల్
మొదలం జేసితిఁ, బిన్న పెద్దలను చుల్క
బుద్ధిం దలంపన్, గనుల్
చదలన్నిల్పితి, గర్వినైతి" నని ప
శ్చాత్తాపముం బొందఁ బో
యెదు సుమ్మా యధికార మేదెడి
బేతెంచుడుం దుర్మతీ

"అవురా! దైవము లేదు, ర్వజని ప
ాంకు, వే
ణ్యాంబుంటయు
దవిధుల్ కేవల కల్పింబులు, నిరా
ధార వ్యర్థ క్రమం
బవు స్వర్గాన వంబు, సర్వజన సా
ధ్యాతం బశక్తప్రిం

బవునం చెంచితి" నంచు నేడ్చెదవు సు
మ్మా ఆధిపత్యచ్యుతిన్ !
పరిణామంబు చరాచరప్రకృతికిఁ
స్వాభావ్య మం చాత్మ నీ
వెఱుఁగంజాలవె ? ఊషరక్షితియుఁగా
దే సర్వసస్యాఢ్య? ని
ర్ఝరిణీ స్ఫూర్తియు నింక దే ? జనుఁడ, నీ
స్వాంతంబున న్నిత్యతా
స్ఫురణం బాయుము, వీడు గర్వమును, జూ
పు న్నిల్పు భావిస్థితిన్.

"ఉపకారం బొనరింపఁ డాయెనని యెం
తో యేడ్తువో మూఢుఁడా,
అపకారం బొనరింప కుండుటయె సు
మ్మా! నీకు మేల్సేఁత" యం
'ఏ గోదించెదు లాఁతినెవ్వగను ని
గ్రాహ భంగిఁ బై వారల
జొప్పాడు నట త్రయు నొక్కఁయిఁటిస్సుష"యం
చూఁకఁ బుట విచారింపవో ?
'గతి యిఁక మీ నాల్గొన్నెటో పెరిఁగితో
కారము సేసిసి గోన ని

అ డ వి పు వ్వు లు

ద్యాలేశంబును గంటి; మిత్రుల దయా
ప్రాప్తిం దదుద్యోగముం
బాలింపం దొరకొంటి; విప్పుడు మమున్
వంచింప యత్నింతు; వే
మో లక్షించెదు క్రొత్తవారి పగిదిన్
భూతాభివిష్టుండవో?

వాడుకరీతి నిన్ దరియ
వచ్చినవారలఁ గోపగించి మా
టాడఁగఁ జూన నెప్పటి క్రి
యన్ దగుబందుల నాదరింపఁగా
జూడకయున్న, మిత్రుల న
సూయను గాంచిన, నష్టు మదిం
గాఁడు సుమీ పరాభవవి
కారశరం బధికారశూన్యతన్.

నిను నీ దార్ఢ్యము నీ చరిత్రమును నీ
నిస్సార వాచాలతన్
గనులం జూచి సహింపలేక సత మే
కాంతంబునన్ సేవకుల్
గినుకం జెట్టఁ గడంగుచుండెదరు;
పత్రి ప్రవాహంబు

యును, మేల్గల్గదటం చెఱుంగ వీఁక నీ
యుద్యోగముం గాల్పనా?

నిత్యము లౌనె సంపదలు ?
నిల్చునె యీ పద మెల్లకాలముం ?

మృత్యువు వెంటనంటుకొని
మేని కషాయము సేయకుండునే ?

సత్యపథం బొకండె నిను
స్వర్గముఁ జేర్పఁగఁజాలు, నేల యీ

భృత్యుల నేడిపించుటలు ?
కృత్రిమపుం బను లాచరించుటల్?

"చేతికిఁ జ్యా—వీఁడు, కృప
సేసిన నీఁక నన్నుఁ గాంచి ని

...తి మెలంగు" ...చు నొన
...రించెద వీ ...కారమయ్యో! నీ

చేఁతకు నవ్వువచ్చుఁ ...ప
సేసినచో నిను గ...వింపఁడే ?

మనస్సువేల త్రొక్క— ఫణి
మట్లు దురాశయ పూ...త్రాత్మకా !

...శ్రోత్రములం జొరంబడవు ...ప్రే
...పముల్ ...నోట రా